

పంచతంత్రం

# మిత్రభేదం

కర్త... విశ్వాత్ముల నరసింహమూర్తి





















కాలం పోయిగ
గడుస్తుండగా
ఏమొచ్చిందో
ఏమోగానీ
పన్నెండేళ్లూ
వర్షం కురవక
చెఱువంతా జల
శూన్యమ్మయినది










హంసలు రెండూ
ఆలోచించగ
ఉపాయమొక్కటి
తట్టినది



సంవత్సర చందా
రు 12-0-0
విడిప్రతిక 4 అ.

# ఆంధ్రపత్రిక

సచిత్రవారపత్రిక

Founder K NAGESWARA RAO

సంపుటము 45
సంచిక 3
10-9-52

నందన భాద్రపద బహుళ సప్తమి బుధవారము



మానవుల ప్రవేశాన్ని మన్నించని మహోన్నత శృంగం ఎవరెస్టు శిఖరం

(డార్జిలింగ్ ప్రాంతంనుంచీ కనిపించే హిమాలయ పర్వతదృశ్యం)

—ఫోటో :- ప్రెస్ ఇన్‌ఫర్మేషన్ బ్యూరో

# ఈ ఉపఖండములో మలేరియా వలన ప్రతి సంవత్సరము 20 లక్షల మందికి పయిగా మృతి నొందుచున్నారు.

మలేరియా వల్ల కలిగే ప్రజా మరణసంఖ్య అటుండ యీ జాడ్యముచే నీరసించిన రోగులు యితర వ్యాధులకతి శీఘ్రముగా పాలగుట గమనించిన పయి భయంకర సంఖ్య మరియు పెరుగుదల సూచించును. మలేరియా సోకుడు నిన్నెల్లప్పుడు బెదరించుచుండును. యెందుకన నిన్నా రోగమంటుటకొక దోమ కాటు చాలును. యీ బెదరింపును నీవు నిర్లక్ష్యము చేసుకోజాలవు.

యీ దినమే నిన్ను మలేరియా బారినుండి 'పాలుడ్రిన్' కాపాడగలదు. ఒక అణా విలువయిన ఒక మాత్ర వారమునకొక తూరి సేవించుచున్న, రోగమును నీదరికి రానీయదు. నీవునీ కుటుంబమును మలేరియానుండి కాపాడు కొనగల శాధ్యతకు కాగల ఖర్చు ఒకరికి ఒక వారమునకు ఒక అణా మాత్రమే. మోతాదులు తెలుసు కొనుటకు క్రింది వివరముల చూడుడు.

మలేరియా రోగకారణమైన దోమ ఒక కాటుతో మలేరియా క్రిములను నీ రక్తములో ప్రవేశపెట్టును. యెప్పుడును యేటవాలుగా మూగు ఆ దోమను నీవు సులభముగా గుర్తింపగలవు. వీటి అభివృద్ధి కాధారమైన నీటి నిలువలు ఇండ్ల పరిసరాలలో వుంచకుండిన మలేరియా బారి నుండి తప్పుకోగలరు. నిదురించునపుడు దోమతెరను వాడుడు. దోమలను చంపుటకు 'గమెక్సేన్' క్రిమికీటక సంహారిణిని మీ గృహములయందు చల్లియుంచుడు.



### యీ అపాయకర చిహ్నముల గమనింపుడు :

మొదట చలిచే వణికించును, జ్వరము తగిలి చెమటలు పోయును. దేహమంతట నొప్పులు, తీపులు పుట్టును. యీ సూచనలను అశ్రద్ధ చేయక తక్షణమే వైద్య సలహా తీసుకొనుము. అప్పుడు నీకు మలేరియా సోకయున్న 'పాలుడ్రిన్' సేవించిన కొద్ది రోజాలలో నయమగు ననియు, యికముందు రాకుండుటకు, అది ఎట్లు తోడ్పడ గలదో కూడ వైద్యుడు నీకు తెలియపరచును. స్వచ్ఛమైన 'పాలుడ్రిన్' పుల్లిపార కాగితములలో ఆరోగ్య విధానముగా సీలుచేయబడినవే దొరకును. మాత్ర ఒకటి ఒకణా మాత్రమే.

# 'పాలుడ్రిన్'

## మలేరియాను తరిమివేయును

సేవించు విధానము

చికిత్సకొరకు: నడివయసుగలవారు, 12 యేండ్లకు మించినవారు ఒక మాత్ర వాడవలెను. 6 నుండి 12 సంవత్సరములలోగల పిల్లలకు అర్ధ మాత్ర. 6 సంవత్సరముల వయస్సు మించని పిల్లలకు పావుమాత్ర చొప్పున ప్రతి దినము జ్వరము తగ్గువరకు యివ్వవలెను.

రక్షణార్థం: మోతాదు పై కనుపరిచినట్లే కాని వారమునకొకమారి నిర్ణీతమైన దినముననే సేవించుచుండవలెను.




'పాలుడ్రిన్'ను భోజనానంతరం సేవించి జలమునైనను పాలనైనను ధారాళముగా త్రాగవలెననుసది జ్ఞాపకముంచుకొనవలెను.

ఇంపీరియల్ కెమికల్ ఇండస్ట్రీస్ (ఇండియా) లిమిటెడ్



ICP 75

## విషయానుక్రమణిక





# హైదరాబాద్ ముల్కీ ఆందోళన

హైదరాబాద్ సికందరాబాద్ నగరాలలో ముల్కీ ఉద్యమాల ఫలితంగా పోలీసులు లాఠీఛార్జీలకు తుపాకి కాల్పులకు దిగవలసి వచ్చింది. శుక్రవారం నాటికి వచ్చిన వార్తల ప్రకారం నలుగురు మరణించారు. తుపాకి కాల్పులవల్లనూ, లాఠీదెబ్బలూ రాళ్ళ దెబ్బలవల్లనూ మొత్తం నలభైమంది గాయపడ్డారు. ముఖ్యమంత్రిగారి కారు, పోలీసు కార్లు, ఒక పోలీసుస్టేషను, కొన్ని బస్సులు, ఒక పోస్టాఫీసు తగులపెట్టబడినాయి. గురువారంనుంచి ఉదయం 6 గంటల మొదలు రాత్రి 10 గంటల వరకూ కర్ఫ్యూ విధించబడింది. గురువారం రాత్రికే పరిస్థితి చల్లబడిందని శుక్రవారంనాటి వార్త.

తుపాకి కాల్పులను గురించి విచారణ జరిపించగలరని హైదరాబాద్ ముఖ్యమంత్రి శ్రీ బూర్గుల రామకృష్ణరావుగారు ప్రకటించారు.

విద్యార్థులను ముల్కీ ఆందోళనలో పాల్గొనవద్దని హెచ్చరిస్తూ, ఇది విద్యార్థులకు సంబంధించిన సమస్యకాదనీ, ఆర్థిక సమస్యమాత్రమేననీ రామకృష్ణరావుగారు చెప్పారు.

ముల్కీ సర్టిఫికెట్లు ఇచ్చే విషయమై నిబంధనలు కట్టుదిట్టం చెయ్యగలరని కూడా రామకృష్ణరావుగారు తెలియచేశారు.

హైదరాబాద్‌లో ముల్కీ సర్టిఫికెట్ తెచ్చుకోడం ఎంత సులువో అందరికీ తెలిసిన విషయమే. ముల్కీ సర్టిఫికెట్ ఉంటే (స్వాతంత్ర్యానికి పూర్వం) ఉద్యోగం దొరకడం కూడా చాలా సులువే. పోలీసు చర్య అనంతరం ప్రజాప్రతినిధుల ప్రభుత్వం ఏర్పడిన తరువాత ముల్కీ, నాన్‌ముల్కీ అనే విచక్షణాభావం ప్రజలలో మొదట అంతరించి అందరం ఏకదేశవాసులమే ననే భావం బలపడినమాట నిజమే. అయితే ఆర్థిక పరిస్థితులు దేశంలో ఇతర ప్రాంతాల్లో మాదిరిగానే హైదరాబాద్‌లో కూడా క్లిష్టంగా ఉన్నందువల్ల కొందరీ పరిస్థితుల్ని సానుకూలపరుచుకుని రాజకీయ పాక్షిక ప్రయోజనాలు సాధించుకోడానికి యత్నిస్తున్నారు.

హైదరాబాద్‌లోనే కాదు దేశంలో ఏ ప్రాంతంలోనూ ప్రజల పరిస్థితి ఒకేరీతిగా ఉంది. ఇందుకు ఎవరినో లేక ఏ పార్టీనో లేక ఏ వర్గాన్నో నిందించుకుంటూ ఆందోళన జరపడం ఆధునిక కాలంలో ప్రత్యేక వ్యక్తిదారుల వ్యాపకంగా ఉంటున్నమాట అందరికీ తెలుసు. ఆంధ్రదేశంలో పరిస్థితికి ఆంధ్రరాష్ట్రం సిద్ధించక పోవడమంటున్నట్లే, దక్షిణాదిని కులభేదాలు సాకుగా చెప్పబడుతున్నాయి; లేదా ఉత్తరాదివారి ఒత్తిడి అంటూ ఆందోళన జరుగుతోంది. ఇలాగే హైదరాబాద్‌లోనూ ముల్కీ ఆందోళన బయలుదేరింది.

ఇలాటి ఆందోళనకు చెప్పబడే హేతువుల్లో కొంత నిజమూ ఉండకపోదు;



శ్రీ కూచిభొట్ల సుబ్రహ్మణ్యశర్మ (యం. యస్. సి).

న్యూఢిల్లీలోని నేషనల్ ఫిజికల్ లాబొరేటరీలలో రీసర్చి అసిస్టెంటుగా పని చేస్తున్నారు. కొలంబో పథకముక్రింద ఆస్ట్రేలియా ప్రభుత్వపు 'ఫెలోషిప్పు'ను పొంది, సిడ్నీలోని నేషనల్ స్టాండర్డ్సు లాబొరేటరీలలోని ఫిజిక్సు డివిజనులో చేరి ఫోటోమెట్రీ (*Photometry*) మొదలగు విషయములలో పరిశోధనలు జరుపుటకు భారత ప్రభుత్వము వారిచే పంపబడుచున్నారు. సెప్టెంబరు 13 వ తేదీన బయలుదేరి సిడ్నీ వెళ్లుచున్నారు.

పూర్తిగా నిజం కానూకాదు.

రాజ్యాంగ నిర్మాణం దృష్ట్యా చూస్తే ముల్కీ ఆందోళన భారత పౌరసత్వ నియమాలకు విరుద్ధంగా ఉన్నదని చెప్పవలసి వస్తుంది. కాని ఏ ప్రాంతాని కా ప్రాంతం అవసరాలను గమనించవలసివస్తే అప్పుడప్పుడీ నియమాలను కొన్ని హద్దులకు లోబడి అమలు జరపడం అవసరమని తోచకమానదు.

ముల్కీ ఆందోళన కేవలం ఉద్యోగాలకే సంబంధించింది; ఇటువంటి ప్రత్యేక అవసరంకింది కిది జమకట్టలేము. ఉద్యోగరీత్యా కాని వ్యాపారరీత్యా కాని అనేకమంది హైదరాబాద్ సంస్థాన వాసులు ఇతర రాష్ట్రాలకు వెళ్లి ధనం ఆర్జించుకుంటున్నవారున్నారు. వారినందరినీ అక్కడనుంచి లేచిపోవాలంటే ఎంత న్యాయముంటుందో, ముల్కీలు కాని ఉద్యోగుల్ని హైదరాబాద్ నుంచి తొలగించాలనడంలో అంత న్యాయం ఉంటుంది.






మద్రాసు రాష్ట్రంలో ప్రభుత్వోద్యోగులలో అత్యధిక సంఖ్యాకులు తమిళులే ఉన్నందువల్ల ఆంధ్రులు అసంతృప్తి చెంది ఉన్నమాట నిజమే. అయితే లభ్యం కాగలవరకూ సమర్థులైన వారిని తెలుగు వారినికూడా వారిజనాభాకి తగినంతమందికి ప్రభుత్వోద్యోగాలివ్వాలని ఆంధ్రులు ఆందోళనచేస్తే, అటువంటి ఆందోళన సక్రమమైనదని ఒప్పుకోవచ్చునే కాని ఆంధ్రదేశంలో పబ్లిక్ వర్క్సు డిపార్టుమెంట్ అరవఉద్యోగుల్ని హోటళ్ల అయ్యర్లనీ, రైల్వేస్టేషన్ మాస్టర్లనీ వెంటనే తరలించెయ్యాలనడం అక్రమం. బెంగాల్ నాగ్పూర్ సెక్షన్ రైల్వేలో విజయనగరం నించి కలకత్తావరకూ అనేక స్టేషన్లలో ఉన్న తెలుగు ఉద్యోగుల్ని, బొంబాయి కలకత్తా మొదలైన నగరాల్లో కల తెలుగు ఉద్యోగుల్నీ వ్యాపారస్థుల్నీ తరిమివెయ్యాలంటే అదెంత అన్యాయమో ఇదీ అంతే. భారత రాజ్యాంగం ప్రకారం భారతదేశ పౌరుడైన ప్రతివానికీ ఏ ప్రాంతంలోనైనా సరే వ్యాపారమూ, ఉద్యోగమూ మొదలైన వానివల్ల స్వేచ్ఛగా జీవనోపాధి సంపాదించుకోగల హక్కు ఇవ్వబడింది.

అయితే ఈహక్కు అన్నిటా అన్ని రాష్ట్రాలలో అమలు జరగడం లేనిమాట నిజమే. కాని క్రమంగా ఇలాటి అవరోధాలు తొలగిపోవలసిన అగత్యం అందరూ గుర్తించినదే.

ఇలాటి ఆందోళనలూ ప్రాంతీయాభిమానాలూ సక్రమమైనవి కానిమాట నిజమే అయినప్పటికీ, పూర్తిగా అక్రమమంటూ కొట్టివేసినంతమాత్రంచేత ప్రయోజనం లేదు. వీనికిగల మూలకారణాలను తెలుసుకొని, ఇట్టి ప్రాంతీయాభిమానాలకు తావు లేకుండా చెయ్యాలి.

మొదట లాయక్ అలీ ప్రభుత్వంలో మంత్రిగా ఉండి, చివరికిప్పుడు కాంగ్రెసులోచేరి క్రిందటి శాసనసభ ఎన్నికల్లో గెల్చిన శ్రీ జి. రామాచారిగారు హైదరాబాద్ హితరక్షాసమితి అంటూ ఒక సంస్థను స్థాపించారు. ఈ సంస్థయొక్క ఆశయం ఇతర ప్రాంతీయులవల్ల హైదరాబాద్ వాసులకు ముప్పుకలుగకుండా

(58-వ పేజీ చూడండి)

# ★ పాములు ★

చీమలు పెట్టిన పుట్టలు
పాముల కిరవైన యట్లు
పామరుడుతగఁగ్ఁ
హేమంబు గూడబెట్టిన
భూమీశుల పాలజేరు –
భువిలో సుమతీ!

భూమీశులు అంటే రాజులు అని అర్థం. రాజులు చేయవలసిన పనులు ఏమిటంటే రాజ్యాన్ని పాలించడం, రాజ్యాన్ని పెంచడం. రాజ్యాన్ని పాలించడం ఎంత ముఖ్యమో, రాజ్యాన్ని వృద్ధి చేయడం కూడా అంత అవసరం. రాజైనవాడు తన చుట్టుప్రక్కలఉండే రాజ్యాలతో విధిగా స్నేహం వృద్ధిచేసుకోవాలి. లేకపోతే, ఆ చుట్టుప్రక్క రాజ్యాలు తనకుప్రక్కలో బల్లెములవలె ఉంటాయి. పొరుగు రాజ్యాలతో పొత్తు ఏర్పడకపోతే అది ఒక విపత్తు, ఆపత్తు తెచ్చిపెట్టుతుంది. అందుమూలంగా తన దేశానికి శాంతి గాని సుభిక్షం గాని ఉండదు. విదేశాలవల్ల విపత్తు ఉంటే, స్వదేశంలో సంపత్తు ఉండదు ఇందువల్ల పొరుగు రాజ్యాలతో పొత్తు సంపాదించాలి. ఇదే మిత్రలాభతంత్రం. తన మిత్రరాజ్యాల సంఖ్యను తాను వృద్ధి చేసికోవాలి. ఇక ఎవరైనా యితర రాజులు తనతో సెయ్యం కలుపుకొనకపోతే, కయ్యానికి దిగి, తనకు కప్పం కట్టేటట్లుగా వారిని లొంగదీయాలి. కేవలం కయ్యం, సెయ్యం చాలకపోతే, ఆ రాజుతో వియ్యం కూడా పొందాలి. తాను జయించిన రాజుల తాలూకు ఆడపిల్లలను తాను వివాహం చేసికొనడం మూలంగా వారితో యింకా సన్నిహితంగా ఉండవచ్చు. వారిని జయించి లోబరచుకొన్నప్పటికీ, వారిని తన సాటి బంధువులుగా గౌరవించినట్లు ఉంటుంది. వారితో తాను యుద్ధం చేసినందువల్ల వారికి కలిగిన ఆగ్రహం యీ పాణిగ్రహణంవల్ల చల్లారిపోయి పరివారమనే సంతోషంతో సామరస్యంగా ఉంటారు. ఇది కూడా రాజుల రాజనీతిలో ఒక తంత్రం. ఆనాటి రాజులు కేవలం స్త్రీలోలురై తమ జనానాలో అంతమంది ఆడవాళ్ళను జమకట్టలేదు.

అంతఃపురంలో ఎంత రాజ్యాంగతంత్రమైనా నడచేది. ఆయా రాణుల సరససల్లాపాలతో రాజులసఖ్యతలు వృద్ధి అయినాయి. రణభూములై రాజ్యాలు రక్తసిక్తం కావడంకంటె, రాణుల పారాణులతో రక్తికట్టిన రాజాంతఃపురంలో కాంతల సంఖ్య వృద్ధికావడం ఎక్కువ నష్టదాకయం కాదన్నారు. ప్రజలప్రాణాలు సుఖంగా ఉండడంకోసమే అంతఃపురంలో రాణుల సంఖ్య వృద్ధి కావడం సంభవించేది. ఇదంతా యీ కాలపు రాజ్యాంగతంత్రం కాదు. ఇదంతా పురాతన తంత్రం. ఈ రాణీయుగం పౌరాణికయుగం కావచ్చు. ఆనాడు శత్రు భయక్రిమి సంహారక సాంబ్రాణివలె సామ్రాజ్యాలను కాపాడింది రాణివాస సువాసినుల స్నేహ సువాసనలే.

ఏమైనప్పటికీ ఒక్కొక్కప్పుడు సామదానభేదోపాయములవల్ల సాధ్యంకాని వారిని సాధించడానికి వీర్యం శౌర్యం చూపించడం అనివార్యం అయ్యేది. అందువల్లనే యుద్ధాలు, దండయాత్రలు చేయడం రాజధర్మంగా భావించేవారు. ధనుర్బాణాలు చేతబట్టి దండయాత్ర సాగించేవారు. "ధర్మం" అంటేనే "ధనుస్సు" అని అర్థం. ధర్మాలంబనం అంటే ధనుస్సును చేపట్టడం. రాజధర్మాలంబనం కోసమే ధర్మాలంబనం అవసరం అయ్యేది. దండయాత్ర సాగించినప్పుడు చండశాసనంగా తమ ప్రతాపం తమ సేనలప్రతాపం పూర్తిగా చూపిస్తారు. ముఖ్యనగరాలు ఆక్రమించి కోటలు పేటలు హోటలు కూడా కొల్లగొట్టవలసి వస్తుంది. ఇళ్ళల్లో దాచిపెట్టిన మూటలు ముల్లెలు యిల్లాలు మెళ్ళో ఉన్న సుల్లలుసహా సైనికులు స్వాహా చేసేవారు. చీమలు కూడబెట్టినట్లుగా సామాన్య పామరజనం ధనం కూడబెట్టితే, అది భూమీశులకైనా, వారి సేనానులకైనా, లేదా వారి జవానులకైనా వశమౌతూ ఉండేది.

కాని, గడచిన మహాసంగ్రామకాలంలో రష్యామీదకు జర్మనుసేనలు దండెత్తినప్పుడు రష్యను గ్రామాలను పట్టణాలను జర్మనులు ఆక్రమించడం మొదలుపెట్టారు. అప్పుడు ఆ గ్రామాలలోను ఆ పట్టణాలలోను ఉన్న రష్యనులు తమ స్థిరచరాస్తులు శత్రుసేనలకు భుక్తం కాకుండా ఎక్కడికక్కడ దగ్ధంచేసి పల్లెలు విడిచి పారిపోయినారు. పంటలుకూడా పరశురామప్రీతిచేసి పలాయనం చేసేవారు. వంతెనలు విమానాశ్రయాలు కూడా ధ్వంసం చేశారు. ఎదుటఉన్న పిల్లవాడు తనకు పెట్టుమని అడిగిపోతాడనే భయంతో ఏదైనా తినేవస్తువును ముందుగానే ఎంగిలిచేస్తారు కొందరు పిల్లలు. రష్యనులు కూడా తమకు దక్కనిది పరులకు చిక్కకూడదనే పద్ధతి అవలంబించారు. దీనినే అప్పుడు "దగ్ధభూతల విధానం" (*Scorched earth policy*) అన్నారు. తురుష్క సేనల దౌష్ట్యములకు పాల్పడి మానమును గోల్పోవ నొల్లక మానవతులైన రాజపుత్రస్త్రీలు ఆ తురకల చేతికి వెరచి చురచురమని ఎరియుచున్న మంటలకు మేనులర్పించిరి. ఇది కూడా దగ్ధ భూతల విధానమే. క్షేత్రభస్మ విధానమే. భూతలందగ్ధం అంటే భూమిని అంతా ధ్వంసం చేయడం తగులబెట్టడం అని అర్థం. భూమిని తగులబెట్టడం అంటే ఆస్తిని ధ్వంసంచేసి భస్మం చేయడం. భస్మంచేస్తే మిగిలేది విభూతి. కాని "విభూతి ర్భూతి రైశ్వర్యం" అన్నారు గనుక విభూతి అంటేనే అయిశ్వర్యం అని అర్థం. శత్రుసేనల రక్తంతో తడిసిన తర్వాత అరివీర రుధిరార్ద్ర రుద్రభూములై మరల రష్యనులకు భద్రభూములై పాడి పంటలతో తులతూగుతున్నాయి. చీమలు పెట్టిన పుట్టలు పాములకు భుక్తం కాగూడదనే సిద్ధాంతమే నేటి రష్యను కమ్యూనిజంలో చెప్పబడిన పరమార్థం. ఒకరి నింకొకరు ఓడించి, పీడించి, ముల్లెలు కొల్లగొట్టి కూడబెట్టడం కూడదంటారు కమ్యూనిస్టులు. అందరికీ సమానసౌఖ్యసంపదలు ఉండాలని వారి సమవాదం. ఇదే వారి సామవేదం.

కాని, అందుకు భిన్నంగా ప్రవర్తించుచున్న యితర దేశాలలో పెద్ద పెద్ద భూస్వాములు, ధనస్వాములు, ఆసాములు తదితర పామరజనంమీద పాటకజనంమీద అధికార ప్రభావం (అథారిటీ థాటీ) చూపుచున్నారు. రైతులపైన రౌతులమంటారు భూస్వాములు. వీరు భూములకు అధిపతులమని చెప్పుకొనే భూమివరులే గాని, భూమి వరులను (వరి ధాన్యములను)

పెంచువారు కారు. ఇదంతా అసాముల పద్ధతి. యాజమాన్య పద్ధతి. ఈ యాజమాన్య తత్వం, ఈ యజుర్వేదం మాకు గిట్టదంటారు కమ్యూనిస్టు సామవేదులు.

కాని, యజుర్వేదం గొప్పదా? సామవేదం గొప్పదా అనే మీమాంసలో పడింది లోకం. "యజమానుడు" అంటే యజ్ఞం చేసేవాడు అని అర్థం. బ్రహ్మ యజ్ఞం, పితృ యజ్ఞం, దేవ యజ్ఞం, భూత యజ్ఞం, మనుష్య యజ్ఞం యివన్నీ పెద్దలు పూర్వులు చెప్పిన యజ్ఞాలు. యజమానుడు అనగా గృహస్థు వీటిని చెయ్యాలన్నారు. యజ్ఞం అంటే యాగం—యాగం అంటేనే త్యాగం—అందుకనే ఆచార్య వినోబా భావేగారు భూయజ్ఞం కూడా ప్రారంభించారు. లక్షలకొలది యకరాల భూమిని త్యాగం చేయడం అపూర్వమైన విషయం మన దేశంలో ఒకప్పుడు యాగం చేయడం త్యాగం చేయించడం నిత్యకృత్యకర్మకాండగా ప్రతి గృహస్థుకూ విధించారు. యాజమాన్యం అంటే యజ్ఞం చేయడమే అన్నారు. యజ్ఞభూమిగా, త్యాగభూమిగా ఉన్నంత కాలమూ యీ కర్మభూమికి దుర్గతి ఉండదన్నారు. మన యాజమాన్య పరమార్థానికిన్నీ, పరసీమలలోని యాజమాన్య శబ్దార్థానికిన్నీ ప్రుతి కలియదు. సైంధవం అంటే ఒకరి అర్థం గుఱ్ఱం కావచ్చు. ఇంకొకరి అర్థం సైంధవ లవణం కావచ్చు. శ్రీకంఠుడు అంటే విషకంఠుడు-శ్రీధరుడు అంటే లక్ష్మీధరుడు. ఒకరి దేశంలో "శ్రీ" అంటే విషంగాని, విష తుల్యమైన విత్తంగాని కావచ్చు. అంత మాత్రాన మన దేశంలోని శ్రీమంతులు కూడా విషపూరితులు కావలసిన అగత్యం లేదు. అంగబలం అర్థబలం ఉంటేనే, హరి వెంటన్ సిరి అన్నట్లుగా శోభిస్తుంది. కాని, వస్తుసంపదకు మించింది ధీసంపద. అదే బుద్ధిబలం. అదే శాస్త్రజ్ఞానం. దానికంటె మించింది ఆత్మబలం- కాని, శాస్త్ర సంపదను ఆటంబాంబులకోసం వినియోగించడంవల్లనే ధీసంపదను దుర్వినియోగం చేయడ మవుతోంది. ఈ శాస్త్రసంపదను జ్ఞానలక్ష్మిని భ్రష్టం చేసినవారికి మోక్షలక్ష్మి లభించదు. సామ్యవాదులకైనా అసామీవాదులకైనా సమానంగా వర్తిస్తుంది యీ సూత్రం.

బ్రహ్మాండమైన ఆటంబాంబులను, హైడ్రోజన్ ఆటంబాంబులను తయారు చేసే ఆటమిక యుగం నడుస్తోంది. అనాగరికులైన ఆటవికులకంటె ఆటమికుల నాగరికతలో మెచ్చదగిన ఉచ్ఛలక్షణం కన్పించదు. భోగ లాలసత్వంకోసం శాస్త్రమథన శాస్త్రపరిశోధన చేస్తున్నారు. కాని, "మృత్యోర్మా అమృతంగమయ" "మృత్యు తత్వం లోనుంచి అమృత తత్వంలోకి నడిపించు!" అని ఆవేదన పడడంలేదు. మర్త్యులు అమరులు కావాలని గాని, అమృతత్వం కావాలని గాని కోరడం లేదు. శాస్త్రశోధకులకు లభించిన భౌతికశక్తిసంపదకు ముచ్చటపడిన లోకం ఆ మోహినీ రూపం చూచి ఆ వ్యామోహంలో మనస్సును లగ్నం చేస్తోంది. ఆ మోహినీరూప వ్యామోహం లేని దేవతలకే ఆ మోహినీరూపం అమృతాన్ని పంచిపెట్టి, తన బాహ్యరూపం మీద కన్ను వేసిన భ్రష్టులకు తన అధరపానం లేకుండా, అమృతపానం అసలే లేకుండా చేసింది. పాల సముద్రాన్ని (జ్ఞాన సముద్రాన్ని) దేవతలూ మథించారు రాక్షసులూ మథించారు. కాని, చివరకు దేవతలకే అమృతం పంచిపెట్టడం అయింది. రాక్షసులకు కూలి డబ్బులు కూడా గిట్టలేదు. అమృతం కావాలని వారు కోరలేదు. ఆ ఒక్క పాయింటుమీద వారి కేసు కొట్టివేశాడు ఆ మోహినీరూపంలో ఉన్న శ్రీ మహావిష్ణువు.

"వెలత మాక్కిగముల నీరై కరంగుచు  
బ్రణయ భంగభీతి బద్ధులగుచు  
నూరకుండి గాని యువిద తేతెమ్మని  
యడుగ జాలరైరి యసురవరులు."

ఆ విధంగా దానవులు సిద్ధాన్నం మన్ను చేసికొన్నారు. అది వాళ్ళ కర్మం.

ఎట్టుగఁబాటుపడ్డ నొక యించుక  
ప్రాప్తము లేక వస్తువుల్  
బట్టుపడంగ నేరవు; నిబద్ధి; సురావళి  
గూడి రాక్షసుల్  
గట్టు పెకల్చి పాల్కడలి గవ్వము చేసి  
మథించి; రంతయున్  
బట్టియు కాక, యే మనుభవించిరి  
వారమృతంబు భాస్కరా!

తాత్పర్యం:- మానవుడు యెంత పాటు పడినప్పటికీ ప్రాప్తము లేనిదే ఏదీ లభించదు. రాక్షసులు దేవతలతో కూడి మందర పర్వతమును పెల్లగించి తెచ్చి పాల సముద్రమును మథించి కూలిలేని చాకిరీ చేసికే గాని, ఫలమేమైనా అనుభవించినారా?

ఈమధ్య సుప్రసిద్ధ వేదాంత కోవిదుడైన డా॥ సర్వేపల్లి రాధాకృష్ణన్ గారు చెప్పిన మాట నిజం. కమ్యూనిజం నాశనం చేయాలని కత్తికట్టి రష్యాను కూల్చి పరిమార్చినప్పటికీ లోకానికి యుద్ధభయంపోయి లోకశాంతి ఏర్పడదన్నారు.

ఐక్యరాజ్యసమితిలో శాంతికోసం అమృతంకోసం మథనం జరుగుతోంది అంటున్నారు. మందరపర్వతాన్ని కవ్వంగాజేసి దానికి వాసుకి అనే సర్పాన్ని కవ్వపుత్రాడుగా జుట్టి అటు రాక్షసులు యిటు దేవతలు మథించారు. మథిస్తే వచ్చింది మధ్యలో హాలాహలము.

నిజంగా లోకశాంతిని అమృతత్వమును కోరే దేశం ఏదో, కోరే జాతిఏదో



వరంగల్లులో ఒక దేవాలయ శిఖరం.

ఛాయాచిత్రకారుడు: శ్రీ గాడె ప్రభాకరగుప్త.

గానికే అమృతం లభిస్తుంది. యంత్ర తంత్ర మంత్ర శక్తి ప్రభావము రాగద్వేషరహితంబుగా, విషయ వాంఛావిరక్తుడై వినియోగించెడి యోగికి, బ్రహ్మజ్ఞానికి, భారతదేశము బ్రహ్మరధము పట్టుచున్నది. అట్టి బ్రహ్మజ్ఞానికి పునరావృత్తిరహిత శాశ్వత బ్రహ్మలోకైకప్రాప్తిరస్తని స్వస్తి చెప్పునది పాశ్చాత్య భూమి. మన ప్రాచ్యతత్వానికి ఈ అప్రాచ్యతత్వము విరుద్ధము.

ప్రస్తుతం పరీక్షార్థం ప్రయోగించే ఆటంబాంబుల కథలువింటే పురాణకథ జ్ఞాపకం వస్తోంది. బ్రహ్మాండమైన పెల్లురు ఆటంబాంబు ప్రయోగించగానే ఆకాశాన్ని ఆవరించింది. అనేక మైళ్ళ ఎత్తుకు మంట లేచింది. పొగల మేఘాలతో బ్రహ్మాండమైన శబ్దం విన్పించింది. ఎక్కడ చూచినా రేడియో శక్తి ప్రజ్వలించింది. క్షీరసముద్ర మధనంలో కూడా హాలాహలం పుట్టగానే,

"కడపటి పట్టపగలింటి వెలుంగుల లక్షితెఱంగున దుర్లక్షితంబై తుదిరేయి వెలింగిన మొగిలుగముల వలనం బడు బలు పిడుగుల వడువున బెడిదంబై పంచభూతంబులుం దేజోరూపంబులైన చాడ్పున దుస్సహంబై"... ఇట్లు హాలాహలదహనంబు జగంబుల గోలాహలంబు సేయుచున్న సమయంబున"—అని వర్ణింపబడింది.

క్షీరసముద్రం అంటే ఆకాశంలో ఉండే *Milky way* అనబడే (పాలవెల్లి) అనిన్ని యీ సముద్ర మధనం అంతటికీ జ్యోతిషపరంగా అర్థం చెప్పవలెననిన్ని అంటారు. ఆ మాటకు వస్తే పాము అంటే వెన్నుపాము అనిన్నీ, అమృతం అంటే యోగసాధన అనే మధనం మననం ధ్యానం వల్ల పొందే బ్రహ్మానందం అనిన్నీ యోగవిద్యావేత్తల మతం.

"ఆదిశేషుని నిదుర లేపిన
బోధసేయును రామనామము"

ఆదిశేషుని నిద్రలేపడం అంటే ఏమిటి? వెన్నుపాముయొక్క పడగ విస్తరించినట్లుగా అనేక నరాలూ నాడులూ మెదడులోనికి విస్తరించిఉంటాయి. యోగసమాధిలో ఆ కుండలిని (ఆ నరాల పడగను) ఏ విధంగా వికసింపజేసి దివ్యదృష్టి మొదలైన యోగశక్తులను పొందవచ్చునో చూపెట్టగల్గిన యోగులెవరైనా యీ దేశంలో ఉన్నారా యని యిటీవల కొందరు మన తత్వశాస్త్రపండితులు విదేశాలనుంచి యీ దేశం వచ్చిమళ్ళీ వస్తామని వెళ్లారు.

రామనామం పూర్తిగా బోధ కావాలంటే వల్మీకంలోనే (పాము పుట్టలోనే) కాపురం ఉండి తపస్సుచేసిన వాల్మీకి




దాసి
(అజంతా 17వ గుహాలోని కుడ్యచిత్రానికి ప్రతిరూపం.)
చిత్రకారుడు :- శ్రీ రమేష్ చంద్ర

అంతటివాళ్ళు కావాలి. ఆదికావ్యమైన రామాయణం రచించిన ఆ మహాకవి అంతటివాడను కాను నేను అని బమ్మెర పోతరాజుగారు

"పుట్టఁ బుట్ట శరంబునన్ మొలువ"

...అని ఒక నమస్కారం చేశారు.

పాము అంటే ఏమిటో అర్థం చేసికొన్నవాళ్ళు సరిగ్గా కన్పించడంలేదు. పూర్వమొక వర్తకునకు తురకభాష నేర్చుకోవలెనని కుతూహలం కలిగింది. ఒక సాహెబ్బుగారిని అందుకై ఆశ్రయించాడు. ఒకమాట నేర్పితే ఒక అణా యివ్వాలని ఆ సాహెబ్బుగారు రేటు నిర్ణయించారు. సరేనని పాఠం ప్రారంభించాడు. "తేల్" అంటే నూనె అని నేర్చుకున్నాడు. "పకడో" అంటే చేతితో పుచ్చుకో అనే మాటకూడా తెలిసింది. ఆ వర్తకుడు తన అంగట్లో నూనె కావలసిన

వారికి నూనె, నెయ్యి కావలసినవారికి నెయ్యి అమ్ముతూ ఉండేవాడు. తురక భాష నేర్చుకొనుటకు ఇంకా డబ్బు ఖర్చు చేయడం అతనికి యిష్టంలేకపోయింది. "తేలు" అంటే నూనె గనుక, "పాము" అంటే "నెయ్యి" అయిఉంటుందని నిర్ణయించాడు. అతని అంగడికి మరొక సాహెబ్బు ఒకనాడు నూనె కావాలని వచ్చాడు. దురదృష్టవశాత్తు నూనె డబ్బాలో సరకు అయిపోయింది. అందుచేత తనవద్ద నూనె లేదనిన్నీ నెయ్యి పుచ్చుకోవలసినదనిన్నీ తురకంలో తెలియ జెప్పడానికి, "సాహెబ్ జీ! తేల్ నై పామ్ పకడో" అన్నాడు. "పామ్ పకడో" అంటే తురకభాషలో "పాదం పట్టుకో" అని అర్థం. ఆమాటకు సాహెబ్బుగారికి తోకత్రొక్కిన త్రాచువలె కోపం వచ్చింది. కాలు పట్టుకోమంటావా? అనే కోపంతో జుట్టుపట్టుకొని వీపుమీద పిడికెడు గుద్దు వేశాడు. వెన్నుపాము విరిగినట్లయింది.

పాము శబ్దానికి "నాగం" అనే మరొక పర్యాయపదం ఉంది. కాని, యీ రెండు శబ్దాలు చేర్చి "నాగపాము" అని కూడా వాడుతున్నాం. అయితే నాగులు అనే జాతివారు అస్సాంరాష్ట్రంలో ఉన్నారు. అక్కడి కొండలను కూడా నాగకొండలు అంటారు. కాని "నగం" అంటేనే కొండ. ఈ నాగులు ఉండే ప్రాంతాలకు ఒకప్పుడు అర్జునుడు భూప్రదక్షిణం చేసిన సందర్భంలో వెళ్లినాడనిన్నీ, అక్కడ ఉలూపి అనే నాగకన్యక అర్జునుని రూపసంపద చూచి మోహించిందనిన్నీ పురాణాలలో ఉంది. ఈరోజున నాగులు అడవి జాతివారని గవర్నమెంటు లెక్కలలో ఉంది. కాని, ఆనాటి పురాణంలో ఉలూపి చాలా ఫ్యాషన్లు తెలిసిన సినెమాటాకీ షోకీగా వర్ణింపబడింది. పాము కుబుసంవంటి సన్నని చీరెకట్టితే, ఆమె నాగకన్య అని భ్రమించి ప్రశంసించాడేమో?

"నాగరిక ముద్రగల మంచిబాగరియట
నాగవాసములో వింత నటనలదట
కులుకు గుబ్బల ప్రాయంపు గోమలియట
వలచి వలపింపదే యెంతవారి నైన"

అర్జునుడే సందేహించాడు నాగకన్యక కాటు వేస్తుందేమో అని.—

"...ఫణిజాతి వీ, వేను మనుజజాతి
నన్యజాతి ప్రవర్తించు టర్హ మగునె?
ఎల యీ కోర్కి? యనిన రాచూలి
కనియె."

ఆఖరుకు అర్జునుడు గాంధర్వంగా ఆ ఫణ్యంగనను చేబట్టడం జరిగింది. ఇద్దరికీ కలిసి "యిలావంతుడు" అనే కుమారుడు జన్మించాడు. అర్జునుడు అటుతర్వాత దానిని వర్ణిస్తూ

"అల జడయందముక్ మెఱుగు
టారు మిటారము నాకు ముందుగా
జిలువ కొలంబటంచు జెలి
చెప్పక తొల్తనె చెప్పె"

ఇలలో లతాంగుల
వ్వాలతుక కాలి గోరులకు
బోలరు; పోలునో యేమొ తారకల్"

అన్నాడు. వాల్జడ పాములాగున ఉన్నదట. దానినిబట్టియే అది నాగకన్యక అనుకున్నాడట. అటువంటి లతాంగి కాలిగోరులకు యితరస్త్రీలు సరిపోలరట. ఒకవేళ తారలు సరిపోలునేమో అన్నాడు. నాగకన్య అంటే ఫణ్యంగన అన్నాడు. అటువంటి జడసొంపుగలవాళ్లు తారలలో ఉండవచ్చునన్నాడు (అనగా చంద్రుని భార్యలలో) అంతకంటె ఎక్కువగా ఒకజడ కాకుండా రెండు జడలు వేస్తున్న యీ కాలంలో నాగకన్యల భయంగాని, ఫణ్యంగన భయంగాని పూర్తిగా పోయిందేమో!

నాటి నాగకన్యలకంటె నేటి నవనాగరిక కన్యల రెండు జడలసొంపును అర్జునుడు రెండింతలుగా కొనియాడియుండెడివాడు. ద్వివేణులు త్రివేణులు చతుర్వేణులు కూడా ఇంకా ఉన్నారు. పంచబాణుని మించు మిటారుల మనెడి పంచవేణులు కూడా ఉన్నారు. సొగసులు వృద్ధియై జడలు ఊడలు దిగినట్లు వృద్ధికావచ్చు. తారలలో యిటువంటివారు ఉంటారని ఏనాడో అర్జున ఉవాచ.

అర్జునుడు చాలా సరసుడు. భుజంగకన్య వరించిన భుజంగుడు. భుజంగం అంటే పాము. భుజంగుడు అంటే సర్పపతి మాత్రమే గాక సరసుడైన విటుడు. భోగి అంటే సర్పం - భోగిఅంటే భోగించేవాడు. భోగము అంటే పాముపడగ - భోగము అంటె ఇంద్రియసుఖము. శ్రీమహావిష్ణువు శేషశయనుడు - భోగశయనుడు - శేషుడే జగత్తును మోయుచున్నాడు. సర్పం శంకరాభరణం. సముద్ర మథనమునకు కవ్వము త్రాడు వాసుకి అనే సర్పం - పాము అంటె ఏమిటో ఆ చిహ్నార్థమునకు పురాణ ప్రమాణాలు తరచి చూడాలి. వేదాలు వేదాంతార్థములు శోధించాలి. ఉత్తరధృవప్రాంతంలో ఆరుమాసాలు పగలు, ఆరుమాసాలు రాత్రిగా ఉంటుంది. సూర్యుడు ఉదయించి నడినెత్తికి వచ్చుటకే మూడుమాసాలు పట్టగలదు. అక్కడ సూర్యుడు మనకు ఉదయించినట్లుగా ఉదయించడు; పాము చుట్టుకొనినవిధంగా వలయాకారంగా గగనమధ్యభాగానికి పొద్దు పైకెక్కుతుంది. వేదాలు పుట్టిన కాలంలో మన ఆర్యఋషులు ఆ ఉత్తర ధృవప్రాంతంలో ఉండి సూర్యుణ్ని ఆదిత్య భగవానుని ఆ రీతిగా వర్ణించి ఆరాధించినారనిన్నీ సూర్యుడే విష్ణువనిన్నీ, ఒక సిద్ధాంతం ఉంది. ఈ పాముచుట్టమీద శ్రీ మహావిష్ణువు శయనించినట్లుగా పురాణాలలో వర్ణించియుండవచ్చు. చంద్రగ్రహణం నాడు చంద్రుణ్ణి రాహువు సర్పరూపంలో వచ్చి కబళించునని పురాణగాథ ఉంది. వైకుంఠపాళి అనబడు పరమపద సోపానపటము లో పాములు నిచ్చెనలు మెండుగా ఉన్నాయి. మన పాపంబులే పాములై మేనుల్ కబళించునన్నట్లుగా జీవుడు పాపకర్మల వల్ల ఊర్ధ్వలోకమును చేరజాలక అధఃపతితుడవుతాడు. కుండలీంద్రుడు అంటే సర్పరాజు. కుండలిని అంటె పాముపడగ - వెన్నుపాములోనుంచి కపాల భాగంలోనికి విస్తరించే నాడీచక్రం కుండలిని అన్నారు యోగశాస్త్రంలో. ఈ పాములకు అంతులేదు. తాచుపాము, నాగపాము, వానపాము, వెన్నుపాము, తొడపాము, శివుని మెడపాము, శ్రీహరి పడకపాము, ఇవన్నీ చిలువల చిద్విలాసాలుగా ఉన్నాయి.

పాము అంటే ఏమిటో, దాని శబ్దార్థం, భావార్థం, పరమార్థం, వగైరా నానార్థాలు తెలియాలంటే జీవశాస్త్రం, యోగశాస్త్రల, మంత్రశాస్త్రం, జ్యోతిశ్శాస్త్రం మొదలైన శాస్త్రాలు చదవాలి. కళలు శాస్త్రాలుకూడా పరిశీలించాలి. కళాశాస్త్రం మాత్రం చదివితే చాలదు. ★

**సీరియల్ :**

# పరారి

(నాటిక)

## జాన్ గాల్స్‌వర్దీ

### మొదటి ఘట్టం

[ఏడాది గడిచింది. ఖైదు ఆవరణలో బంగాళాదుంపల పొలం. మంచు దట్టంగా పడుతూ ఉంటుంది. వెనక వేపునా, ఎడమ వేపునా రాతిగోడ నీడలా కనపడుతుంది. డెనాంట్ మరో ఖైదీతో కలిసి తవ్వితీసిన బంగాళాదుంపల్ని వొంగి ఏరుతున్నాడు. మంచులో ఇద్దరూ నీడల్లా కనపడతారు. ఇటూ అటూ ఏరిన బంగాళా దుంపలు తట్టల్లోకి విసురుతున్నారు. మెల్లిగా గుసగుసలాడుతున్నట్లు మాట్లాడుకుంటు న్నారు.]

డె : పాపం ఆ దెబ్బతో తకీమని చచ్చిపోయాడు. నాకు అయిదేళ్లు పడింది.

తోటిఖైదీ : హారి! పోలీసోణ్ని! నిన్ను ఉతికి తా జేసి ఏలాడదియ్యాలేదనయ్యామే. అద్దుట్టమంతుడివి.

డె : పాపం ఆ అమ్మాయి నిశ్చయంగా నాపక్షం మాట్లాడింది. ఆ అమ్మాయేవొచ్చి నాపక్షాన్న కోర్టులో చెప్పి ఉండకపోతే...

ఖైదీ : అదీ అద్దుట్టమే - అలా సెప్పేవోళ్లే ఉండరు. ఆళ్లకిమాత్రం పానభయం కాదూ! ఇంకెన్నాళ్లుండాలి?

డె : మూడేళ్ళు - ముక్కుమూసుకున్న సన్యాసిలా గడిపేశాను.

ఖై : నాకు నాలుగేళ్లు. నువ్వు బలేవోడివో - ఇస్కో అంటేశాన.

డె : (నవ్వుతాడు. నడుం నిగిగి తిన్నగా నిలబడతాడు) మొత్తానికి కుక్కతో పోల్చావ్.

ఖైదీ : ఇశ్ (వేలితో వెనక్కి చూపుతూ) మంచున్నాదని ఆళ్లిన తేరనుకుండా వెంటి? మా సెడ్డోళ్లు.

డె : ఉన్నట్టుండి దట్టంగా పట్టేసింది మంచు, ఇలాగే ఉంటుందల్లే ఉంది ఇవాళంతా.

ఖైదీ : ఈరోజుల్లో ఇలాగే ఉంటది. ఇంకో చనంలో మన్ని పిలత్తారు సూడు! మంచంటే పిరికి. ఇలాటప్పుడేగా, పారిపోయేవోళ్లు సందు సూసుకునేది.

డె : ఇక్కడనుంచి తప్పించుకున్నవాళ్లు ఇంతవరకూ ఎవరూ లేరంటారే.

ఖైదీ : కొందరు పారిపోవాలని సూశారులే.

డె : నిజం? నాకూ ఓసారిచూడాలనుంది.

ఖై : ఆపనిమట్టుకు సెయ్యమోకయ్యోయ్ నేస్తం! ఆ తరాత బట్టలు మార్చుకోవాల, డబ్బుండాల, కారోటుండాల. అప్పుడుగాని ఆశేనాలేదు. అప్పుడైనా పట్టేత్తారు. అసలీ సుట్టుపక్కలంతా ఎడారిలాగుంటది. ఆణ్ని మా సెడ్డ దెబ్బ తీసుంటావు. ఆదెబ్బతో సె నోరావలిచ్చేశాడు కొనూలు.

డె : అబ్బే. మామూలుగానే దవడమీద కొట్టాను. దానికి చచ్చిపోలేదువాడు. వెనకాల ఇనపరాట తగిలింది తలకి పాపం (మళ్ళీ వొంగుని దుంపలు ఏరతాడు.) పెళ్లి కాలేదులే, అదీ కొంత అదృష్టమే.

ఖై : అద్దుట్టమా? అదెలా సెప్పగలంలే! ఆడి సంగతింక మరిచిపోవయ్యా. యుద్ధంలో సిపాయిలకేం బట్టింది సెప్పు. (ఒక దుంపతీసి) మా బాగా బలిసింది దుంప.

[గోడవైపునుంచి ఒకవార్డర్ వస్తున్నట్లు మంచులో చూచాయగా కనపడుతుంది.)

వార్డర్ : ఏయ్! కబుర్లాడకం డక్కడ. ఓవరసైపోతే రెండోవరస అందుకోండి. ఊఁ! అదైపోగానే వొచ్చి మీ వరసలో నుంచోండి. (ఖైదీలు మాట్లాడరు) ఏం వినపడిందా లేదా? మాటాడరేం.

ఖైదీ : సిత్తం బాబూ.

[వార్డర్ దూరంగా వెడతాడు]

ఖైదీ : మంచోడేలే ఈడు. నే సెప్పలా. పని గబగబా అయిపోతే టీ ఇత్తారు ఫోదాం.

డె : కుక్కబతుకు! ఇంకా మూడేళ్లు. ఛీ. కుక్కబతుకు.

ఖైదీ : అబ్బే! ఈడు నిజంగా మంచోడు సుమా. ఇదుగో ఈ మంచుమూలానే గాని- ఇదంటే ఆళ్ళకి మా సెడ్డ బయ్యం. బయపడ్డావోళ్ళల్లాగే ఉంటారులే.

డె : కావచ్చులే. కాని నాకింకా అలవాటు కాలేదు — కాదు కూడా.

ఖై : బింకమైనోడివిలే. మీలాటోళ్ళు మొదుణ్నుంచీ బింకం నేర్చుకుంటారు.

డె : (మెల్లిగా, ఆత్రుతతో) నీకీ మైదానం అంతా తెలుసుగా చెప్పు. దారెలాగ?

ఖైదీ : ఏముంది. (గుసగుసగా) అటేపు. రోడ్డు ఓ మైల్లో ఉంటది.

డె : అక్కణ్నించి ఊరు?

ఖై : ఏడు మైళ్ళు. మారాజా, అంత పని సెయ్యమోకు పట్టేత్తారు సుమ్మా. నా మాటిను.

డె : ఓక్, నేను జర్మనీలోనే తప్పించుకొచ్చాను.

ఖైదీ : ఏంటి? జర్మనీనించా? ఆరి పిడుగా!

డె : ఇక్కడివాళ్ళకి పసిగట్టే కుక్కలూ అవీకూడా లేవుగా

ఖై : లేవనుకుంటాలే, కాని బాబూ నామాటిను. ఈ సుట్టుపక్కల జనమంతా నీకు యిరోదం. కైదీలంటే ఆళ్ళందరికీ కోపం. సిత్రంగాదూ!

[దుంపలేరడం ఒక వరస అయిపోయింది. ఇద్దరూ వొంగునే ఉంటారు]

డె : ఇదుగో దారెల్లాగో ఈకర్రతో నేలమీద గీసి చూపించు.

ఖైదీ : ఇదుగో ఇది పెద్ద రోడ్డు. ఇక్కడో అడ్డురోడ్డు కలుసుద్ది. ఇదిగో ఇక్కడో సత్తిరువుంది. పది పన్నెండు మైళ్లంట దిక్కణ్నించి హైరోడ్డు.

డె : రెండోరోడ్డు కలిసేచోట రోడ్డు దిగితే ఏముంటుంది?

ఖైదీ : అంతా మైదానం, ఆపైన అడివి. అడివిదాటితే బత్తీ తగులుద్ది. ఆపై వూర్లో రైలుంటది. కాని ఇది మాత్రం మరిసిపోకు. నువ్వు బైటపడ్డాది మొదుల్చుకుని అందరూ నిన్ను మారాజుని సూడ్డానికొచ్చినట్టొత్తారు. తప్పించుకుందామనుకుంటే అడివి.

[క్షణం నిశ్శబ్దం. డెనాంట్ నేలమీద ప్లాన్ పరీక్షిస్తాడు.]

వార్డర్ : (దూరంనించి) ఏయ్ తొరగా కానియ్యండి ఆఖరి వరస.. మిమ్మల్నిద్దర్నే.

(మంచు మరింత దట్టపడుతుంది.)

డెనాంట్ : (నేలమీద గీతల్ని కాలితో చెరిపేస్తూ) బలే దట్టంగా ఉంది. ఇదే వీలు. దాటేసా

అనువాదం :
సూరంపూడి సీతారామ్

[వెనక్కి వెళ్లి దుంపలు రెండో వరస అందుకుంటారు.)

ఖైదీ: (వేలితో చూపిస్తూ) అదుగో ముళ్ళ ఇనపజాలలో ఆ గోడమీద ఇంకో గటం కాపలాకుంది. ఆడు సూశాడంటే తుపాకి శారెట్టి కాల్చేత్తాడు.

డే: తెలుసులే. అదుగో గోడకామూల కెడతాను. వాడికి ముందువైపునే దూకేస్తాను. ఈ మంచులో అనుమానంకొద్దీ వెనక్కి చూస్తూ ఉంటాడుగా! అదిగో ఆ కుడిచేతి వేపు వాడు చూడకపోతే దాటేశానన్నమాటే.

ఖైదీ: నీకు పిచ్చెక్కిందయ్యోయ్ బాబు! సూడంగానే తుపాకి ఢామ్మంటది. సూడకపోయినా కొంచెంసేపులో ఇక్కడ పనైపోదూ. అప్పుడేనా కనిపెట్టేత్తారు.

డే: కానీవోయ్ ఇంతేనా! ఈపీడా వొదిలిపోతుంది.

ఖైదీ: సరే, పోక తప్పదంటావు. అయితే పెద్దరోడ్డుచ్చుకుని ఇడవకుండా లగెత్తు. ఇంతమంచులో మమ్మల్ని గదుల్లో బెట్టకుండా నీయెంట బడ్డాని కెవరూ రారులే. యేరు దాటంగానే ఉత్తరపేపుని సిన్న అడివితగులుద్ది. సీకటడేదాక అక్కడ దూరిదాక్కో. లేకపోతే రేత్రంతా కన్ను ఆపని మంచులో మైదానంలోనే తచ్చాడ్డమాద్ది. జాగ్రత్త. తెల్లారేసరికి బిగుసుకుపోతావ్.

డే: నీమే లెప్పుడూ మర్చిపోను. ఇంకపోతే, పోవాలనుకున్న తరవాతకంచె ల్నాసి జంకకూడదు. (కొన్ని బంగాళా దుంపలు తీసి జేబుల్లో దాచుకుంటాడు) ఇవి పచ్చివి తినడమెల్లా?

ఖైదీ: ఎప్పుడూ కూళ్ళేదు. ఇదుగో ఇదికూడా తీసుకో (చిన్న రొట్టిముక్క ఇస్తాడు)

డే: నిజంగా నువ్వే మంచివాడవు సుమా.

ఖైదీ: ఏమో నీ అదృష్టం. నాకూ వొచ్చెయ్యాల్నుందిగాని, గుండెసాలడం లేదు.

డే: నువ్విటు చూస్తూ ఉండు. వస్తా.

[మూడడుగులు గోడవైపు నడుస్తాడు. క్షణం ఆగి చటుక్కుని వొంగి కాళ్లమీదా చేతులమీదా పరుగు అందుకుని గోడదగ్గిర చేరతాడు. పిల్లిలా గోడమీంచి ఒక్క ఉదుటున దూకేస్తాడు. ఆ క్షణంలో తోటి ఖైదీ ప్రాణాలు బిగబట్టి సవ్వడికోసం ఆలకిస్తుంటాడు.]

ఖైదీ: అరి దేవుడా! దాటేసినాడు, పోలీసోడు సూణ్ణేదు. (కాళ్లు నిలవడం లేదు. నిలబడినచోటే పరవళ్ళు తొక్కుతాడు) నేను కూడా దాటేద్దునా? పోవాల, అబ్బ!

[సరిగ్గా అతనూ వొంగోవాలనుకున్నప్పుడే వార్డర్ గొంతుక వినబడుతుంది.]

వార్డర్: (దూరంనించి) ఏయ్! నిన్నే ఏం చేస్తున్నావ్? నీతోటి వాడేడీ?

ఖైదీ: గోడమూల కెళ్లాడు సార్.

[స్తంభితుడై నిలబడి నిరీక్షిస్తాడు.]

వార్డర్: (దగ్గిరికి వస్తూ) ఏమిటి?

ఖైదీ: ఏమోనండి సార్. ఎక్కడున్నాడో తెల్దు.

వార్డర్: రా నాతో చెప్తా. (గోడ సమీపించి ఆగుతాడు) ఏయ్ ఎవరక్కడ? పోలీస్. నీపక్కనించెవడైనా ఆ దారిని వెళ్లాడా? ఇక్కడొకడు కనపడ్డంలేదు.

పోలీసు: (దూరంనుంచి) ఎవరూ ఈ దారిని వెళ్లలేదే.

వార్డర్: జాగర్తగా చూడు. ఒకడు తప్పించుకున్నాడు.

(మరొక వార్డర్ గోడమీద నిలబడి కనపడతాడు)

రెండో వార్డర్: నీకన్నుగప్పి పారిపోయాడన్నమాట.

మొదటివార్డర్: ఛీ. దిక్కుమాలిన మంచు మన ప్రాణాల కొచ్చింది. తుపాకి పేల్చు; అందరికీ తెలియాలి. ఆ! ఆ! వొద్దొద్దు. అన్నట్టు మరిచిపోయాను. తుపాకి వింటే వీళ్లందరూ పరుగులు తీస్తారింక. స్టేషన్ కెళ్ళి రిపోర్టియ్యి వెంటనే. (ఖైదీ వంక తిరిగి) ఏయ్. నువ్వు నోరుమూసుకుని ఉండు తెలిసిందా! నీ కిదంతా ముందే తెలుసన్లేవుంది.

ఖైదీ: నాకేం తెల్దుసార్. ఎవురో పెద్ద బాగ్గెమంతులట, ఆరు కాఫీకి పిలిశారని సెప్పాడండి. మీరు తొందరపడతన్నారని నేను దుంపలేరతానే వుండిపోయానండి.

మొదటివార్డర్: సర్లే, నువ్వుమాత్రం నోరు మెదపకు. రా ముందునడు.

[ఇద్దరూ మంచులో నడిచిపోతారు — తెర].

## రెండో ఘట్టం

[మొదటిఘట్టం తరవాత ఏడుగంటలు గడిచిపోతుంది. మైదానం; దట్టంగా పట్టిన మంచులో కన్ను పొడుచుకొన్నా కనపడదు. కనపడకపోయినా పెద్ద రోడ్డును పట్టి వెతుకుతున్న ఇద్దరు పోలీసుల గొంతుకలు వినపడుతూ ఉంటాయి]

మొదటి పోలీసు గొంతుక: ఈ దిక్కుమాలిన రోడ్డు వెతకడ మేమిటోయ్? విసం లాభంలేదు. కన్ను పొడుచుకున్నా కనపడడంలేదు.

రెండో పోలీసు: వార్డర్లిద్దరొచ్చి అప్పుడే ఇదంతా వెతికినట్టున్నారు. ఈ మంచులో వెతకడమంటే మాటలు కాదు. ఎవరేనా రోడ్డే ఎక్కుతారు కాని చస్తే రోడ్డు దిగరు.

మొదటి పోలీసు: కాని వాడు రోడ్డుమీదే ఉంటాడనెక్కడుంది? ఎక్కడైనా ఉండొచ్చు.

రెండో పోలీసు: సరే, ఈమంచులో కదిలి తిరుగుతున్నాడూ అంటే రోడ్డుమీదే అనుకో, మైదానంలో తిరుగుతాడని ఎవ డనుకుంటాడులే.

మొ. పో: వాడు అడివివేపు వెళ్ళాడేమో! '

రెం. పో: ఆ! ప్రాణభయంలే.

మొ. పో. లేకపోతే బస్తీదారిపట్టి వుంటాడా?

రెం. పో: ఆదారి బాగా కాపుదల వేశారుగా.

మొ. పో: పారిపోడానికి చూసినవాళ్ళని తోలుకంచాలతో కొట్టి చర్మం వొల్చెయ్యాలంటాను. మనఅవస్థ వాళ్లకేం తెలుస్తుంది? అబ్బబ్బ! ఇంత యాతన ఇదేకాని మరోటిలేదు. నీదగ్గిర చుక్కేమైనా ఉందా?

రెం. పో: ఓ! ఇదుగో. కనపడ్డంలేదు కాని వాసననిబట్టి అందుకో.

మొ. పో: వాడు దొరకాలిటు నాయనా, అప్పుడు వాడిసంగతి చెప్తాను. ఇలాంటి మంచులో మన నిద్ర చెడగొట్టి తిప్పలు పెడుతున్నవాణ్ని చూస్తే చంపెయ్యాలనుంటే తప్పా అంట?

[గడగడ శబ్దం]

రెం. పో: నాకు కొంత మిగల్చవోయ్. (గుసగుసగా) ఆ చప్పుడేమిటి? విను. (ఇద్దరూ ఆలకిస్తారు.)

మొ. పో: అబ్బే! ఏం వినపడ్డంలేదే. (మళ్ళీ సీసా నోటికెత్తబోతాడు)

రెం. పో: ఆగొక్కసారి. ఏదో జర్రుమన్నట్టు చప్పుడు వినపడింది. బాటరీలైటు వేద్దునా?

మొ. పో: వొద్దొద్దు. (మళ్లీ ఆలకిస్తారు)

రెం. పో: ఈ చుట్టుపక్కల కంచర గాడిదలున్నాయి.

మొ. పో: వాడు మహాచెడ్డ దుండగుడులే.

రెం. పో: అవును. యుద్ధంలో కెప్టెన్‌గా ఉండేవాట్ట.

మొ. పో: వీడే హైడ్, పార్కులో

పోలీసుని చంపాట్ట. ఎంత గుండెలుండాలి! ఇలాంటివాళ్లు పారిపోతేనే చెడ్డ చిక్కు. ఊపిరాగి పోయేదాకా పరుగెత్తడంమానరు.

రెం. పో: చదువుకున్నవాడే మళ్లీ. పరిగెత్తడం తప్ప ఇంకో ఉపాయం తోచలేదు కాబోలు. పరిగెత్తి ఎక్కడికి పారిపోతాడని గ్రహించి ఉండాలి, బుర్ర ఉన్నవాడైతే.

మొ. పో: ఈ పెద్ద పెద్ద వాళ్ళకి తిక్కెక్కువ. ఆతిక్క ఓ పట్టాని వొదల్దు. ఆ లాయర్నెరగవ్? ఎవడిదో సొమ్ము అపహరించాడు. వాణ్ణి, వాడి దర్జానీ చూస్తే ఒళ్లు మండుకొస్తుంది.

రెం. పో: నాకసలు వీళ్ళంటే జాలే కాని, పెద్దమనుష్యుల్ని చూస్తే చిరాకు. పెద్దమనుషులైనవాళ్లు అసలిలాంటి చోటికెందుకు రావాలంటాను. వాళ్ళకి నువ్వన్నట్లు గొప్పెక్కువ.

మొ. పో: ఇంకోటిలే పాపం, అంత పైకొచ్చి హఠాత్తుగా ఇంత నీచస్థితికి కూలిపోవడం మాటలు కాదు.

రెం. పో: (ఆవలిస్తాడు) అబ్బా, ఇప్పుడు రెండో నిద్రలో ఉండవలసింది. అరె! (తెల్లబోతాడు) అదుగో చప్పుడు మళ్లీ. (ఇద్దరూ ఆలకిస్తారు) ఇదేదో కంచరగాడిదనుకుంటాను. అబ్బ. పోలీసు బతుక్కంటే దరిద్రం మరోటిలేదు. మా ఆవిడ గోలెడుతుందని చూస్తున్నా కాని లేకపోతే ఈపాటికి చీపురు పట్టుకుని వీథులు తుడిచేవాడిని.

మొ. పో: ఇలాటప్పుడు తప్ప మనుద్యోగాలు ఫరవాలేదనుకో. ఇలాటివి సినీమాల్లో ఎరుగుదుం కాని మనం చెయ్యాలి సొచ్చేసరికి——

రెం. పో: అవునవును. నువ్వా సినీమా చూశావూ. వాడు నుంచున్న పట్టుని చ్రుని పైకెగిరి ఇంటికప్పు మీదుంటాడు. మనమూ దొంగల్ని గజదొంగల్ని చూశాం కాని ఇలా ఎగిరేవాళ్లనెక్కడా చూళ్లేదు.

మొ. పో: అదేమిటంటే, వాడికి పాదాలకింద స్ప్రింగులేవో ఉండి ఉంటాయి. నువ్వు సరిగ్గా కనిపెట్టి చూశావో లేదో సినీమాల్లో, వాడిచేతులు మనకు మసగ్గా ఉన్నాయి. బహుశా వాడేపగ్గమొపట్టుకుని ఎక్కివుంటాడు, ఆపైన ఫిలింలో ఏదో మాయచేసి పగ్గాన్ని మాయంచేస్తారనుకుంటాను.

రెం. పో: నిజమే. నాకది తట్టనేలేదప్పుడూ. మరి పైనున్నవాడొక్కసారి కిందికి దూకి సరిగ్గా కోడుమీదికే ఎలా అడుగేస్తాడు?

మొ. పో: అదో ట్రిక్కు. అసలు జనాన్ని ఇల్లా మోసంచేస్తున్నందుకు ఈ సినీమాల వాళ్ళని జైళ్ళలో పెట్టాలి.

రెం. పో: పోయినవారం సినీమాయే బాగుంది నేనూ మా ఆవిడా వెళ్లాం. హాలు హాల్లంతా కళ్ళనీళ్ళు పెట్టుకున్నారనుకో.

మొ. పో: నువ్వలా అంటావు. నాకు చార్లీచాప్లిన్ సినిమాలు చూస్తే ఒళ్లు తెలియదు. సినీమా అయిపోయిం తరవాత లేని బలమేదో చేరుకున్నట్టుంటుంది. మరి అందెందువల్లంటావ్?

రెం. పో: వాడిది ఒట్టి అమాయకం.

మొ. పో: ఇంకో సుక్కిద్దూ ఉంటే (గడగడ శబ్దం) వాడు చిక్కాడో నువ్వు నన్నాపకపోతే వాణ్ని పీకి పిసికేసేమాట నిజం.

రెం. పో: నేనూ అంతే. ఓపనిచేద్దాం. ఎవరా పాలో చూద్దాం కాసెగరేస్తాను. చెప్పు తలా, తోకా?

మొ. పో: తల.

రెం. పో: పడింది తలా తోకా చూడు. ఏదీ లైటెయ్యి.

[మొదటి పోలీసు బాటరీ లైటు వేస్తాడు. మంచులో రెండుముఖాలు కనపడతాయి. కాసు చూస్తారు బాగా దగ్గరగా)

రెం. పో: తోక! నీ పందెమే పోయింది. (లైటు ఆర్పేస్తారు) ఇప్పుడేమిటన్నమాట? నేను నిన్నాపాలా, నువ్వు నన్నాపుతావా?

మొ. పో: నువ్వు నన్నాపాలి.

రెం. పో: అబ్బే. నేను గెలిచానుగా. అంటే దానర్థం నేను వాడిమీద విరుచుకుపడతాను. అబ్బబ్బ! ఏం చలిగావుంది. సరిగ్గా చూడు ఆ అడ్డుపగ్గం రోడ్డుకి అడ్డంగా ఉందో లేదో. తడిమి చూడు.

మొ. పో: ఓ, బిగుతుగా నేవుంది కాని మరీ దిగువైపోయింది. తగిల్తే మనిషికి సరిగ్గా పొట్టలో తగలాలితాడు.

రెం. పో: అట్టే అలా వుండకూడదు. అలా తగిల్తే ఏముంది? ఆగి పక్కగా పారిపోతాడు. లేదా వెనక్కి తిరిగి పరిగెడతాడు. అడ్డుపడేది, మోకాళ్లకింద పడాలి. అప్పుడు వాడు బోర్లబొక్క పడిపోతాడు. ఆవెంటనే వాడు లేచేలోగా మనం వాడిమీద పడతాము.

మొ. పో: ఛ. ఛ. చుట్ట కాల్చుకోడానికేనా లేదుకదా. అవునుగాని ఖైదీలికి చుట్టలివ్వచ్చంటావా?

రెం. పో: మొత్తానికివ్వచ్చులే. దాంతో కొంచెం మెత్తబడతారు. మనకది మంచిదే. కొందరు కొందరు మంచివాళ్లుంటారు. వాళ్లకి రోజూ ఇవ్వచ్చు. ఆగాను. (గుసగుసలో) విను అదేమిటో. అడుగుల చప్పుళ్లు!

మొ. పో: అవును.



కప్ప పడుచుతో కప్ప యువకుడు:— "ఆఖరుసారి అడుగుతున్నాను — నువ్వు నన్ను పెళ్ళి చేసుకోకపోతే అమాంతంగా ఈ నూతిలోకి దూకేస్తాను. తరవాత నీ యిష్టం."

రెం. పో: ఇలా చూడు. వాడు తాడు దగ్గిరికి వొచ్చే సమయానికి ఠకీమని కళ్ళల్లోకి లైటువేసి చటుక్కున ఆర్పేస్తాను. ఉలిక్కిపడి ముందుకి పరిగెత్తబోతాడు. తాడుతగిలి దభీమని బోర్లపడతాడు. జాగ్రత్త. కాసుకో (ఆలకిస్తారు)

మొ. పో: వొస్తున్నాడు కాసుకో. కాని.—వాడుకాక ఇంకోడైతే!

రెం. పో: అయినా వొదిలిపెట్టకూడదు. ఆగు.

[క్షణం సేపు నిశ్శబ్దం అడుగుల చప్పుళ్లు దగ్గిరౌతాయి.]

రెం. పో: (అతిమెల్లిగా) ఊ! రెడీ.

[బాటరీ లైటు వేస్తాడు, డెనాంట్ ముఖంమీద. వెంటనే లైటు ఆరిపోతుంది. పోలీసులు ముందుకెగబడతారు. చీకటిలో పెనగులాట]

మొదటి పోలీసు గొంతుక:

దొరికాడురా బాబు.' దొరికాడు.

రెండోపోలీసు గొంతుక: (సగం కుత్తుక బిగిసి) లేదురా బాబూ లేదు. నా గొంతుక పిసికేస్తున్నావురా. దొంగలూ.

[తెర]

(ఇంకావుంది)

# పనిలేని పార్వతి

"ఏమ్మా! పార్వతీ! ఏం జేస్తున్నావ్" అంటూ ప్రవేశించాడు పిచ్చయ్య.

"కూర్చోండి బాబాయ్" అంది కాఫీ డికాషను తీస్తున్న పార్వతి.

"ఎప్పుడూ ఏదో ఒక పని జేస్తుంటావ్; కాస్త తీరిగ్గా కూర్చోవేం తల్లీ!" అన్నాడు పిచ్చయ్య కళ్ళజోడు తీస్తూ.

శ్రీ యం. శేషాచలపతి

"ఏం పనుంది బాబాయ్. మావి రెండు పొట్టలు. ప్రొద్దున్నే లేచి, కాఫీకి కాసిని నీళ్ళు పెట్టి, ఒక సోలెడు బియ్యం పెడితే మళ్ళీ రాత్రికేగా. ఎప్పుడన్నా అనుకుంటే సాయంత్రంపూట నేనే వూసుబోక కాసిని కాఫీ త్రాగుతాను. అంతే గదూ!" అంది పార్వతి.

"మీవి రెండు పొట్టలు. ఆయన నెలకో నూటయాభయ్ రూపాయలు తెస్తాడు. లక్షణంగా గడిచిపోతుంది. దిగులు,విచారంలేని సంసారం" అన్నాడు పిచ్చయ్య.

"ఉండు. కాసిని కాఫీ త్రాగుదుగాని" అని కాఫీ తెచ్చిపెట్టింది.

"మీరు దిగులూ విచారంలేని సంసారం అన్నారుగదూ బాబాయ్, కాని నేను తెలిసో, తెలియకో ఒకటి చెబుతున్నాను. దిగులూ, విచారం లేనివాళ్ళు యీ ప్రపంచంలో ఎవరన్నా వున్నారా అని నా అనుమానం. అయితే ప్రతివాళ్లు మీరన్నట్టుగానే అంటుంటారు."

ఈ మాటలకు ఏభయ్యేండ్ల వయస్సుగల



పిచ్చయ్యకు ఆశ్చర్యం వేసింది. "అయితే నీకేం లోటు పార్వతీ" అన్నాడు.

"బాబాయ్! మీరిటువంటి ప్రశ్న వేస్తా రని నాకు తెలుసు. అయితే సమాధానం కూడా సులభంగానే తెలుసుకోవచ్చు" అన్నది పార్వతి.



పార్వతి వున్న కుటుంబంలో పుట్టింది. కొద్దో గొప్పో ఇంగ్లీషుకూడా చదివింది. ఆమె చదువుకున్న వానినే పెండ్లి చేసుకొంది. వయసుకూడా పెద్దకాదు. ఒక పాతికేండ్లుంటయి భర్తకి. రైల్వే ఆఫీసులో నెలకో నూటయాభయ్ రూపాయలు సంపాదిస్తాడు. ప్రొద్దున లేచి ఒక సోలెడు బియ్యం పెడితే యిద్దరికీ సరిపోతుంది. అత్తమామలుగాని, ఆడబిడ్డలుగాని లేకపోబట్టి, వారి ఆలనాపాలనా లేదు. ఆమె, నడుం విరుచుకోవాల్సినంత కష్టం గూడా లేదు. అయితే పిల్లలు మాత్రం లేరు.

"అయితే పిల్లలు లేరనేగా! పిల్లలున్న వాళ్ళ కష్టసుఖాలు నీకు తెలియనివే మున్నాయి" అన్నాడు పిచ్చయ్య తన జీవితంలోని అనుభవాన్ని ఏకరువు పెడుతున్నట్లుగా.

"మీరు పొరబాటు పడుతున్నారు బాబాయ్! నాకసలా దిగులు లేనేలేదు. అనేకమంది పిల్లలున్న, సంసారాల్ని చూచాను. ఆ పిల్లలవల్ల వచ్చే ఆనందం కన్నా దుఃఖమే ఎక్కువనే విషయం నాకు తెలుసు. ఆ పిల్లా జెల్లాతో పడేపాట్లకన్నా యీ రెండు ప్రాణాలు యీరకంగా కడదేరితే చాలు" అన్నది పార్వతి. ఆమె మనస్సులోని అభిప్రాయం పిచ్చయ్యకు అయోమయంగా వుంది. సామాన్యంగా ప్రతి స్త్రీ తల్లిగా కావాలని కోరకుండా వుండదు. కాని యింత చిన్న వయసులోని పార్వతి పిల్లలవల్ల కష్టసుఖాలు కాచివడబోసినట్లుగా చెబుతుంటే ఆయనకు మతిపోయినట్లయింది. బహుశా ఆమె కేదన్నా చెప్పరాని మనోవ్యాధేమన్నా వుందేమోనని అభిప్రాయపడ్డాడు.

"నాకు తెలిసినంతవరకు మా అల్లుడు చాలమంచివాడు" అన్నాడు పిచ్చయ్య.

"ఆయన చాలమంచివాడే బాబాయ్, ఆయన విషయంలో అనుకోవాల్సిందేమీ లేదు. మేం యిద్దరం, ప్రొద్దున్నే వండడం. ఆయన్ని, ఆఫీసుకు పంపడం. ఖర్చు లేదు. పనిలేదు. పాటూ లేదు. ఏం తోచదు. కూర్చొని కొంచెంసేపు చదువుకొంటాను. తర్వాత మళ్ళీ పనే వుండదు. ఏదో, ఏమిటో ఆలోచిస్తుంటాను.

ఒకళ్ళు కూటికి లేక పస్తులుపడుకోవడం, ఒకళ్ళు తిన్నంత తిని పారవేయడం, ఒకళ్లు మట్టసంగా గడపడం ఏడ్చే యిల్లాలొకతె. నవ్వే ఆవిడ ఒకతె. ఇవన్నీ ఆలోచిస్తుంటే మతిపోయినట్లుంటుంది. మనస్సుకు శాంతనేదే వుండదు. ఎప్పుడూ ఏదో విచారంగా వుంటుంది. ఎంతవున్నా ఎంత సుఖంగావున్నా ఏదో విచారం ఒక



ఒక లక్షాధికారి యింట్లో ఇద్దరు దొంగలు పడి ఒక డబ్బుపెట్టె దొంగిలించి పారిపోతున్నారు. వారిలో ఒకడు :- "అరేయ్. ఇక్కడెక్కడైనా ఆగి డబ్బు ఎంతుందో లెక్క పెడదామా?"

రెండోవాడు :- ఇప్పుడెందుకురా? రేపు పొద్దున పేపర్లో చూద్దాం లే.

*　　*　　*

"మీ ఆయనా నువ్వూ ఎప్పుడూ కీచులాడుకున్నట్టే ఉండరమ్మా. ఎంత అన్యోన్యం!"

"అవును. ఆయన దారి ఆయనదీ, ఆయన దారే నాదీని."

విధంగా పీడిస్తుంది, ఏదో చెప్పలేను. నేను యిదంతా ఏం పనిలేకపోవడంవల్ల నేమో నని ఆలోచిస్తుంటాను. బహుశా సోమరితనం లేకపోతే యీ దిగులు వుండదేమో!" అన్నది పార్వతి.

పిచ్చయ్యకు పార్వతి పిచ్చిమాటలు వినేటప్పటికి నవ్వొచ్చింది. అమాయకత్వంలోని ఆలోచనలని పిచ్చయ్య అనుకొన్నాడు. కాని పిచ్చయ్య మాత్రం ప్రతివారికీ ఏదో ఒక లోటుంటుందనీ, అదే విచారంగా పీడిస్తుందనీ అనుకొన్నాడు.

నాలుగుసంవత్సరాలు గడిచినయ్. ఈ నాలుగుసంవత్సరాలలో అనేక మార్పులు జరిగినయ్ పార్వతి జీవితంలో. ఈనాటి పార్వతికీ, ఆనాటి పార్వతికీ పోలిక ఎక్కడా లేదు. ఆమె భర్త రైల్వే కేసులో 'సస్పెండ్' అయ్యాడు. భర్త సంపాదన పోడయింది. పూర్వం దాచిందేమన్నా వున్నదంటే, నగలు పడిపోవడంవలన అప్పులవాళ్లు ఎగవేసే స్థితికి వచ్చారు. ఇప్పుడా యిద్దరిపొట్టలు జరగడమే కష్టమైంది. భర్త ట్యూషనులు చిన్నచిన్నగా ప్రారంభించాడు. ఆ వచ్చే డబ్బుతో యిద్దరకూ పొట్టగడిచే ఆశ కూడ లేదు. పార్వతి కుట్టుమిషను ప్రారంభించింది. ఈవిధంగా ఆమె జీవితం మారిపోయింది. ఆమె శ్రమపడందే పొట్టగడిచేదే కష్టమైంది.

ఒకనాడు పార్వతి మిషను కుడుతున్నది. ఆనాడు పిచ్చయ్య వూరినుంచివచ్చి పార్వతిని చూడటానికి వచ్చాడు.

"అమ్మా పార్వతీ!"

"రండి బాబాయ్"

పిచ్చయ్య లోపలికొచ్చి మంచంమీద కూర్చున్నాడు. నలుమూలలా పరిశీలించాడు. పూర్వం వున్న ఆడంబరం లేదు. ఒకమూల చిన్న నులకమంచం. దండెం మీద రెండు మాసిన చీరెలు. చినిగిన చొక్కాలు. ప్రక్కన కుట్టు మిషను. మిషనుమీద పార్వతి. పార్వతి ముఖంలో పూర్వంవున్న కళాకాంతులు లేవు. పేదరికం వుట్టిపడుతున్నది. ఇదంతా చూచేటప్పటికి పిచ్చయ్యకు కనుగొలకులలో నీళ్ళు తిరిగినయ్.

"ఓడలు బండ్లవుతుంటయ్. బండ్లు ఓడలవుతుంటయి. కాని దానికోసం విచారపడవలసిన అవసరం లేదు." అన్నాడు పిచ్చయ్య జాలిగొంతుతో. పార్వతి పరధ్యానంలో వున్నట్టుగా వుంది. మళ్ళీ పిచ్చయ్యే "పార్వతీ! ఆనాడు ఎప్పుడూ కూర్చోడంవలన, ఏం తోచక విచారంగా వుంటున్నదని అన్నావు"

పార్వతి వుక్కిరిబిక్కిరై "అవును" అన్నది.

"ఈ కాయకష్టంవలన సోమరితనం పోయిందిగదూ" అని ప్రశ్నించాడు పార్వతిని.

"అవును" అన్నది పార్వతి.

"ఆనాటివలె విచారాలు లేవా?"

పార్వతి తడిగొంతుతో "ఆనాటి పార్వతిని గాను" అంది.

విచారంతో మిళితమైన ఆమె గొంతు మిషను బరబర శబ్దంతో కలిసిపోయి ఆగదంతా ఆక్రమించింది. ★

'చీకటిబడాల—'

'సరే నువ్వు బయలుదేరేటప్పుడు నన్ను లేపు—నేను శానాదూరం నడిసి అలిసిపోయుండాను. కాశంతసేపు కునుకు దీత్తేనేగాని పాణం జేరుకోదు.'

ఆ రాతుని కొయ్యచెప్పులు అలానే పక్కన వదిలేసి, ఆ రాళ్లగుట్టమీద అలాగే పడుకున్నాడు. ఒకటి రెండు నిమిషాల్లో నిద్రబట్టిపోయింది; కుంభకర్ణుడులా గుర్రుగొట్టేస్తున్నాడు;

రోడ్డుకూలీ, యీమధ్య నీలిటోపీ తీసేసి యెర్రటోపీ ధరించటం మొదలుబెట్టాడు. ఆ యెర్రటోపీ వారగా వంచి నిద్రపోతున్న ఆ కొత్తమనిషివంక పరకాయించి చూస్తున్నాడు. ఆ కంచుమొహం, ఆ బిరుసుగడ్డం, ఆ జిర్రబొచ్చు, ఆ యెర్రటోపీ, నాటు గొంగడితో కుట్టిన ఆ ఉన్నికోటూ, కోటులోనుంచి, కండలు దిరిగి కనుపించుతున్న ఆ యెదురొమ్మూ,—ఆ మనిషిని జూసి గుండె కొట్టుకున్నాడు. నిద్రబోతున్న ఆ మనిషి మీదికి వంగి, అతని కోటుక్రింద ఆయుధాలు యేమేమి వున్నాయో పరిశీలించటానికి ప్రయత్నించాడు. కాని, అతను గుండెలమీద చేతులు అడ్డంగా వేసుకుని నిద్రపోతూ వుండటంచేత వీలుపడలేదు. 'ఈ ఉక్కుభీముడిముందు ఎలాంటి రాతికోటలైతే మాత్రం యేవిఁ ఆగుతాయనుకున్నాడు. ప్రొద్దు గూకిపోతోంది; పలుగూపారా సర్దుకుని, నిద్రపోతున్నవాణ్ణి లేవగొట్టాడు.

నిద్రపోతున్నవాడు బద్ధకంగా లేచి ఒళ్ళు విరుచుకున్నాడు:

'ఆ కొండకి ఆకాడ అయిదారుమైళ్ళు పోవాలన్నమాట.

'అవును అంతే'—

'సరే'—

రోడ్డుకూలీ కొండదిగి గ్రామంలోకి వెళ్లిపోయాడు; నీళ్లు దాగటానికి కుళాయిదగ్గిరికి తోలుకొచ్చిన బక్కపశువులను ఒత్తిగిలించుకుంటూ ప్రతిమనిషి చెవులోనూ యేదో గుసగుసా రహస్యంగా చెబుతున్నాడు. అలా, ఆ రహస్యం గ్రామంలోవున్న ప్రతిఒక్కడి చెవిలోనూ చెప్పాడు. రాత్రి భోజనాలైన అనంతరం, గ్రామస్తులంతా, మామూలుప్రకారం, యిళ్ళల్లో పడుకుని నిద్రపోలేదు. అంతా బయటికివచ్చి కబుర్లాడుకుంటూ వీధిలో కూర్చున్నారు. గుంపులు గుంపులుగా కూర్చుని గుసగుస లాడుకుంటున్నారు—ఆందోళనగా ఆకాశంవేపు చూస్తున్నారు. ఆ గందరగోళమంతా యేవిటో అర్థంకాక స్థానిక సర్వాధికారి మాన్సియర్ గాబెల్లీ నెమ్మదిగా, రహస్యంగా, యింటి పైకప్పమీది కెక్కి, తానుకూడా అటువైపు ఆకాశంలోకి పరకాయించి చూచాడు. పొగగూటికి వెనగ్గా దాక్కుని వీధిలో కూర్చునున్న చీకటి ముఖాలవైపు తొంగిచూచాడు.

చీకటి దట్టంగా అలుముకుపోతోంది. పెద్దపెట్టున గాలి దుమారం రేగింది. జమిందారు కోటచుట్టూవున్న పెద్దపెద్ద చెట్లన్నీ ఆ గాలికి జీబూతాల్లా ఊగిపోతున్నయ్. ఆ చెట్లమధ్యగా బడి, నాలుగుప్రక్కలనుంచీ నలుగురు వ్యక్తులు కోటముందు ఆవరణలో వచ్చి కలుసుకున్నారు. నాలుగు లైట్లూ ఒక్కసారి వెలిగినై. నాలుగు లైట్లూ నాలుగు మూలలకూ మళ్లీ విడిపోయినై; మళ్లీ అంధకారం ఆవరించుకుపోయింది.

ఆ అంధకారం కూడా ఎంతోసేపు లేదు; క్షణమాత్రం; ఆకోట స్వయంప్రకాశంగల యేదో మాయామందిరంలా దానంతటికదే చీకట్లో కనుపించసాగింది. ఉన్నట్టుండి కిటికీలలోనుంచీ, దరవాజాలలోనుంచీ పెద్దపెట్టున జ్వాలలు రేగిపోయినై. ఆ మంటల్లో కోటబురుజులమీదవున్న రాతిముఖాలు నిద్ర మేల్కొని కంగారుగా గుడ్లురిమి చూస్తున్నయ్.

కోటలో చిక్కడి వున్న నలుగురు ముగ్గురు సేవకులూ ప్రాణాలు దక్కించుకుని బయటపడ్డారు. కోటముందు కట్టేసివున్న గుర్రాలమీద యెక్కి తలోవైపుకూ పరారీ చిత్తగించారు. ఆ అశ్వికులలో ఒకడు యెకాయెకి గ్రామంలోకి పరుగెత్తుకొచ్చి గాబెల్లీ యింటిముందు ఆగాడు: 'స్వామీ!—అంటుకు మండిపోతోంది! ఏవిఁ జేద్దాం?'—

ఏవి జేస్తారు! రోడ్డుకూలీ, అతనితోపాటు వీధిలో గుమిగూడివున్న రెండు మూడువందలమంది గ్రామస్థులు: చేతులు గట్టుకుని, నిమ్మకు నీరెత్తినట్టు నిల్చుని, ఆకాశంలోకి లేస్తున్న మంటలవైపు వినోదంగా చూస్తున్నారు. 'తస్సాదియ్యా బలేగా మండుతోంది' అంటున్నారు, పీడ విరగడైపోతోందన్న కచ్చతో. ఒక్కడైనా కదల్లేదు.

లాభం లేదనుకుని, కోటలోనుంచివచ్చిన నౌకరు, అక్కడనుంచి కదిలి, జైలుగుట్టవైపు గుర్రాన్ని పరుగెత్తించాడు. జైలు గేటుముందు కొంతమంది అధికారులూ, సిపాయిలూ నిల్చుని మంటలవంక చూస్తున్నారు. 'స్వామీ! రక్షించండి! కోట తగలడిపోతోంది. దాన్లో ఎన్నో అమూల్యమైన వస్తువులున్నాయ్' అని గోలబెట్టాడు, ఆ నౌకరు. అధికారులు సిపాయిలవంక చూశారు. సిపాయిలు మంటలవంక చూశారు. ఉత్తరువులిచ్చినవారూ లేరు; వాటిని అమలుపరచటానికి సిద్ధంగా వున్నవారూ లేరు.

'ప్చ్! లాభం లేదు!—తగలడి పోయేదే!'—పెదవులు చప్పరించారు.



ఆ నౌకరు నిరాశ చేసుకుని మళ్ళా ఊళ్ళోకి పరుగెత్తుకు వచ్చాడు. ఊరంతా దేదీప్యమానంగా వుంది. అక్కడున్న స్త్రీ పురుషులందరికీ హఠాత్తుగా ఒక సర్దా పుట్టింది. ఇంటింటా కొవ్వొత్తులు వెలిగిస్తే బాగుంటుందనుకున్నారు. ఇంటింటా ఒక్కసారి మైనపువత్తులు వెలిగినై. తమదగ్గిర మైనపువత్తులు లేనివాళ్ళు గాబెల్లీనే బదులడిగి పుచ్చుకుంటున్నారు. ఆ యివ్వటంలో కొంచెం వెనకా ముందూ ఆడుతున్న గాబెల్లీవంక ఒక మందహాసం పారేసి, అదివరకల్లా కుక్కిన పేనులా పడుండే రోడ్డు మాలీ: 'కొవ్వొత్తులూ గొడవా లేకుండా, ఒళ్ళకు నిప్పెట్టేస్తే జల్సాగావుంటుంది' అన్నాడు.

కోటాకోటా దానంతటికదే మండిపోయింది. చుట్టూవున్న చెట్లన్నీకూడా, ఆ మంటలకు మలమలా మాడి నల్లగా కమిలిపోయినై.

అంతవరదాకా ఉల్లాసంలో మునిగితేలుతున్న గ్రామస్థులంతా, ఒక్కసారి గాబెల్లీ యింటిని చుట్టేశారు. బయటికి రమ్మని కేకలు పెడుతున్నారు. గాబెల్లీకి గుండెలు జారిపోయినై. వీధితలుపుకు యింట్లోవున్న రోళ్ళూ కుందులూ అడ్డంతోసి వాటి మీద భైటాయించి కూర్చుని 'ముందుగతి యేమిటా' అని ఆలోచిస్తున్నాడు. ఉన్నట్టుండి అతనికి ఒక ఆలోచన తట్టింది. గబగబా ఇంటి పైకప్పుమీదికి యెక్కాడు; ఆ జనంగనక వీధితలుపు పగలగొట్టేట్టుంటే, తాను యింటిమీదినుంచి తలక్రిందుగా వీధిలోకి పడిపోయి, వీధిలో మూగిన జనంలో ఒకణ్ణో యిద్దర్నో చితగ్గొట్టెయ్యాలనుకున్నాడు. అదృష్టవశాత్తూ అలాంటి అఘాయిత్యమేమీ జరక్కుండానే—తూరుపురేఖలు పొడిచి తెల్లవారిపోయింది. తెల్లవారిపోవటంతోనే, ఆ ముట్టడి కార్యక్రమం విరమించి, యెక్కడివాళ్ళక్కడ తమతమ పనుల్లోకి వెళ్ళిపోయారు. సూర్యభగవానుడి దయవల్ల ఆనాటికి గాబెల్లీ ప్రాణాలుదక్కి బ్రతికి బయటపడ్డాడు.

## 33

ఆ విధమైన తుఫాను రేగటం ఆరంభమై అప్పటికి మూడుసంవత్సరాలైంది. ఈలోగా లూసీకూతురుకు మూడు పుట్టినరోజు పండుగలు గడిచినై. మూడుసంవత్సరాలనాడు అంటుకున్న అగ్నిజ్వాలలు యింకా అదే ప్రకారం భీభత్సంగా మండుతున్నయ్. మూడుసంవత్సరాలనాడు ఫ్రెంచి ప్రజాసముద్రంలో ప్రభవించిన ఆ పోటు, మళ్ళా ఆటు అంటూ ఎరగకుండా అదే ప్రకారం పొంగులు రేగిపోతోంది. దాని తాకిడితో పుడమి కంపించిపోతోంది. రక్తపతాక ఆధ్వర్యం క్రింద, మృగతుల్యులుగా మారిపోయిన ఆ ప్రజల పదధ్వనులు, దూరాన్నుంచి, లూసీ యింట్లోవున్నవారందరికీ కూడా విలయతాండవంగా వినిపిస్తున్నయ్.

వెనకటికి ఒక శాస్త్రముంది. ఒకానొక అయోగ్యుడు, అనేక సంవత్సరాల తరబడి ఉచ్ఛిష్టమంత్రాలెన్నో పఠించి, నానా తంటాలూపడి ఒక మహాభూతాన్ని ఆవాహన చేశాట్ట! తీరా అభూతం కట్టెదుట కనుపించగానే, దాన్ని చూసి గుండె బేజారై, కాళ్ళకు బుద్ధిచెప్పాట్ట; ఫ్రెంచి జమీందారులు సరీగా అదే తంతు జరిపారు.

నానా లుచ్ఛాపనులూ చేసి, ఆ మహాభూతం ఉద్భవించేవరకూ నిద్రపోయారుకారు. తీరా అది యెదురయ్యేసరికి దాని తాకిడికి తట్టుకోలేక, అక్కడ ఫ్రాన్సులో వుంటే మానప్రాణాలు దక్కవనే గాబరాతో దేశదేశాలకూ పరారీ చిత్తగించారు.

ఈ బాపతు జమిందారు లందరికీ, లండన్ టెల్సన్ బ్యాంకు అనాథ శరణాలయంగావుంది. దయ్యాలు, పూర్వం తాము బ్రతికివున్నప్పుడు యేయే యిళ్ళల్లో వుండేవో, చచ్చిన తరవాతకూడా ఆయాయిళ్ళను ఆశ్రయించుకు తిరుగుతాయని చెబుతారు. అలాగే యీ పెద్దమనుషులుకూడా, తమకిప్పుడు చేతిలో యెర్రనియేగానీ లేకపోయినా, పూర్వం తాము రొక్కాలు దాచుకున్న స్థలం గనక, ఆ బ్యాంకును, విడవలేక దాన్ని ఆశ్రయించుకు తిరుగుతున్నారు. అంతేకాక, టెల్సన్ బ్యాంకుకు, ఫ్రాన్సునుంచి యెప్పటికప్పుడు తాజావార్తలు వస్తూవుంటై. టెల్సన్ బ్యాంకు కొంచెం ఉదారమైన సంస్థ కావటంచేత, పడిపోయిన తన పాత ఖాతాదారులంటే కొంత సానుభూతితో వ్యవహరించేది. ఇలాంటి తుఫాను రేగబోతోందని ముందుగానే తెలుసుకోగలిగిన దూరదృష్టిగల జమీందారులు, పెద్ద పెద్ద మొత్తాలు ముందుగానే యింగ్లండులోని టెల్సన్సు బ్యాంకుకు పంపి, యిక్కడ దాచుకున్నారు. మరి వాళ్ళంతా యిప్పుడు ఇంగ్లండుకు వచ్చేశారు. నిత్యకృత్యపు ఖర్చుకరాముతులకు డబ్బు తీసుకోవటానికి బ్యాంకుకు వస్తూవుంటారు. వాళ్ళూ, యేరోజుకారోజు ఫ్రాన్సునుంచి పరారిఅయి వచ్చినవాళ్ళూకూడా, లండనులో కాలు మోపగానే, బ్యాంకుకు వచ్చి, తాము మకాందిగిన సంగతి తెలియజేసుకుంటారు. ఈ ఖాతాదార్ల సౌకర్యార్థం, టెల్సన్ అధికారులు ఫ్రాన్సునుంచి వచ్చిన వార్తలను, తాజా తాజాగా పోస్టర్లుగా వేసి, బ్యాంకుగోడలమీద అంటిస్తూవుండేవారు. ఆ వార్తలను చదవటానికికూడా ప్రజలు తండోప తండా



లుగా రావటంతో బ్యాంకు వరండాలన్నీ కిటకిట లాడుతూ వుండేవి.

అలా, జనకోలాహలంగా వున్న ఒకరోజున, మామూలు ప్రకారం, లారీ బల్లదగ్గిర కూర్చుని పని చేసుకుంటున్నాడు. చార్లెస్ డార్నే మోచేతులు బల్లమీద మోపి ముందుకువంగి ఆయనతో నెమ్మదిగా మాట్లాడుతున్నాడు.

'మీలో ఇంకా యౌవనపు జిగి సడల లేదని నాకు తెలుసు- అయినా ఒకమాట చెప్పవలసివుంది...' అంటూ నసిగాడు, డార్నే.

'నేను ముసలివాణ్ణయానన్నది నిజమే—అయితే'—

'అయితే యేమిటంటే—రోజులా బాగుల్లేదు—దూర ప్రయాణం—బరితెగివున్న దేశం—పారిస్‌లోమాత్రం మీకు రక్షణ వుంటుందని యేమిటి నమ్మకం ?'

'నాయనా చార్లెస్—నువ్వు చెప్పిన కారణాలనుబట్టే, నేను బయలుదేరిపోవటం యుక్తమని తోస్తోంది. ఏమంటే, క్షేమం సంగతికివస్తే, నాకు మరేం ఫరవాలేదనుకుంటాను. అక్కడ హుమ్మస్సులో వున్న పడుచువాళ్లు అంతమంది వుండగా, ఎనభయ్యోపడిలోబడ్డ ముసలివాణ్ణి నా జోలికి యెవరొస్తారు ? పారిస్‌నగరం కల్లోలంగా వున్నదన్నావే, నిజంగా అలాంటి కల్లోలమే రాకపోతే, ఇక్కడినుంచి అక్కడికి మనిషి వెళ్లిరావలసినపనే తగిలేదిగాదు గదా ! ఇక కష్టనిష్ఠురాలతో కూడిన దూర ప్రయాణమన్న మాటకూడా నిజమే. ఇన్నాళ్ళూ ఈబ్యాంకు ఉప్పూపులుసూ తిన్నాను; ఈ బ్యాంకుకు అవసరంవచ్చినప్పుడు, యేవో కష్టనిష్ఠురాలున్నాయని నేనే వెనకాడితే, మరొక రెవరు తెగించి బయలుదేరతారు '?

'అక్కడికి నేనూ వెళ్లాలనే అనుకుంటున్నాను' అన్నాడు డార్నే, అదో ఆందోళలో వున్న మనిషిలా.

'బలేపని—మంచివాడివే'—ఓ చెంప నన్ను బయల్దేరవద్దని సలహా చెబుతూ—నువ్వు ప్రయాణమా!—ఫ్రెంచి పెద్దమనిషివి, ఆ దేశంతో మంచీ చెడ్డా సంబంధ బాంధవ్యాలున్నవాడివీ, ఈ కల్లోలపరిస్థితిలో నీవక్కడికి వెళ్ళటమా ?—నిరవాకమే!'—

'నేను ఫ్రెంచివాణ్ణి కావటంచేతనే, ఈ తరుణంలో అక్కడికి వెళ్ళాలని నామనసు తహతహ పడుతోంది. పాపం ఆ ప్రజలంతా యెన్నో బాధ లనుభవించారు. వాళ్ళు తెలియని ఆ వేశంలో పడిపోయారు తగిన రీతిని చెప్పిచూస్తే, కొంచెం తమాయించి ప్రవర్తించరా ? అని ఆశగావుంది. గతరాత్రి లూసీతో మాట్లాడుతూ...'

'ఆదేశం యావత్తూ అంతకల్లోలంగా వుందని తెలిసికూడా, ఒక చెంప అక్కడికి వెడతానంటూ, ఇంకా లూసీ సంగతెందుకెత్తుతావ్—ఏముఖంతో'.

'ఇంతకీ నేను బయలుదేరటం లేదుగదండీ' అన్నాడు, డార్నే, చిరునవ్వు నవ్వుతూ: 'మీరు వెడతానంటుంటేనే చెబుతున్నాను'—

'నేను నిజం చెబుతున్నా విను తండ్రీ!—ఇందులోవున్న ఇబ్బంది సబ్బంది లేవిటో నాకు అర్థంకావు; ప్రస్తుతం బ్యాంకు వ్యాపారమంతా ఎంతో బాదరబందీలోవుంది. ఆ దేశంలోవున్న మా రికార్డు పుస్తకాలు, పత్రాలూ బాండులు వగైరా యావత్తూ చాలా చిక్కులో పడిపోయినై. వాటికి యేక్షణానికి యేగతి పడుతుందో యేవీ చెప్పలేము. ఆ కాయితాలూ గట్రా, యేవన్నా ఆ జనంచేతుల్లోబడి తగలబెట్టేశారంటే, హరోంహర !—యెన్ని కుటుంబాలు కూలిపోతాయో నీకేం తెలుసు? అలాటి సంఘటన యే క్షణానైనా జరగొచ్చు—రేపో మాపో పారిస్‌కు నిప్పుబెట్టెయ్యరని యేమిటి నమ్మకం ? అందుకే దీపంవుండగానే యిల్లు చక్కబెట్టుకోవాలని యీ తొందర ! పోయి, మరీ అవసరమున్న కాయితాలు నాలుగూ కట్టగట్టుకుని యివతలికి జారేసుకోవాలి. ఏది యేమైనా కష్టకాలం; బ్యాంకుకు యిబ్బందివచ్చి ఈ కార్యభారాన్ని నామీదవుంచి ఆదేశించినప్పుడు—నావంటివాడు-యేదో కాస్త మోకాళ్లు పట్టుకుంటున్నాయనే అనుకో—వెనుకంజవేయటం యెలా సాధ్యం ? ఇక్కడికి అరవై సంవత్సరాల నుంచీ బ్యాంకు ఉప్పూ పులుసూ తింటున్నాను. నిజానికి, నేను ముసలాణ్ణని అనుకుంటున్నావుగాని, ఇక్కడున్న తక్కిన వాళ్ళతో పోల్చిచూస్తే నేను పదహారేళ్ల బాలాకుమారుణ్ణనుకో!'

'మీ యువకహృదయాన్ని అభినందించుతున్నాను' అన్నాడు డార్నే, చిరునవ్వు నవ్వుతూ.

'టట్—నాన్సెన్స్—వేళాకోళం—ఆడుతున్నావ్ ?—ఏది యేమైనా ఒక్కటిమాత్రం నిజం; పారిస్‌నుంచి ఆ కాయితాలు యివతల పడటమంటే మజాకాపని కాదనుకో—సింహంతో చెలగాటం; అయినా ప్రయత్నించక తప్పదు: యశోవా మృత్యుర్వా'.

'అయితే యీ రాత్రికి మీ ప్రయాణం ఖాయమే నన్నమాట'—

'అహా! బయలుదేరి తీరాలి—ఇప్పటికే చాలా ఆలస్యమైపోయింది'.

'వెంట మరొక రెవర్నైనా తీసుకువెడుతున్నారా ?'

'వీలైతే జర్రీని తీసుకు వెడదామనుకుంటున్నాను—వాణ్ణి చూస్తే యేదో ఇంగ్లీషు బుల్‌డాగ్ అనుకుంటారు గాని అంతకంటే మరేం ప్రమాదం వుండదు.

'మళ్ళా మరొక పర్యాయం తమ యువకహృదయాన్ని అభినందించుతున్నాను.'

'మళ్ళా అదే నాన్సెన్స్ వద్దంటున్నాను—ఈ పనేదో కాస్త పూర్తిచేసుకు యివతలికి వచ్చి మాట దక్కించుకున్నానంటే తక్షణం రిటైరై కులాసాగా కాలక్షేపం చెయ్యాలనే, అపేక్షతో వున్నాను. యువకహృదయం లేదు, బండలూ లేదు'.

లారీ బల్లదగ్గిర ఈ సంభాషణ జరుగుతున్నంతసేపూ, ప్రక్కవరండాలో బెంచీలమీద పడిగాపులు పడున్న ఫ్రెంచి జమిందారులు కొంతమంది—తిరుగుబాటుచేసిన వెధవల నందర్నీ ఇట్టా చితగ్గొట్టేస్తాం అట్టా చితగ్గొట్టేస్తాం అంటూ డచ్చీలు కొడుతున్నారు. వాళ్ళతోపాటు బాతాఖానీ వేస్తున్న కొంతమంది ఆంగ్లేయ సనాతనిష్టులు, నిష్కారణంగా అలాంటి భీభత్సవిప్లవం రేగటం కారణంలేని దురాగత మంటున్నారు.

వాళ్లల్లో స్ట్రయివర్ కూడా వున్నాడు. అక్కడ బల్లమీద కూర్చునున్న ఫ్రెంచి జమీందారుతో బిగ్గరిబిగ్గరిగా మాట్లాడుతున్నాడు. ఆజనాన్నిహతమార్చటానికే, భూగోళంమీదనుంచి ఆకాశానికి యెగరగొట్టెయ్యటానికి మార్గాలేమేమున్నాయో, ఆలాపాయంట్లన్నీ జమీందారుకు సలహాయిస్తున్నాడు. ఈ పేచీలు గనక వాడితే, తోకలమీద ఉప్పు చల్లితే గద్దలు గనక యెలా చెల్లాచెదరైపోతాయో, ఆ వెధవలుకూడా అదేవిధంగా చెల్లాచెదరై నాశనమైపోతా రంటున్నాడు. లారీ బల్లప్రక్కన నిల్చుని యీ ధోరణంతావింటున్న డార్నీ లోలోపల కంటగించుకుంటున్నాడు.

ఇంతలోనే, బ్యాంకు గుమాస్తాలలోని ఒక వృద్ధపితామహుడు లోపలినుంచి సీలువేసివున్న ఒక కవరు తీసుకొచ్చి లారీ బల్లమీద వుంచాడు: 'ఈ చిరునామాదారు ఎవరో యేవన్నా తేలిందా?' అన్నాడు.

ఆ కవరుమీదవున్న చిరునామా, ప్రక్కనే నిల్చునున్న డార్నె కంటబడ్డది. అది తన పేరే కావటంచేత వెంటనే చకితుడైనాడు.

'సెయింట్ ఇవ్రేమూండ్ ప్రభువు సన్నిధికి; C/o, టెల్సన్స్ అండు కంపెనీ, లండన్' అని వుంది.

వివాహం జరిగిననాటి ఉదయం, డాక్టర్ మానెట్ డార్నె చేత ఒక వాగ్దానం చేయించుకున్నాడు. ఆ వాగ్దానం ప్రకారం, డాక్టర్‌గారు అనుమతించేవరకూ, డార్నె తన అసలుపేరును యెవ్వరికీ చెప్పరాదు. అందుచేత డార్నె అసలుపేరు యేమిటో లూసీకిగాని, లారీకిగాని మరెవ్వరికీగాని రవ్వంతేనా తెలీదు.

ఆ వొచ్చిన వృద్ధపితామహునితో లారీ: 'ఇక్కడున్న వాళ్ళనందర్నీ పేరు పేరు వరసనీ భోగట్టా చేశాను. ఈ చిరునామా దాఖలా వ్యక్తి యిక్కడ యెక్కడా లేడు' అన్నాడు.

లారీగారు ఆ ఉత్తరాన్ని వరండాలో వున్న జమిందారులందరికీ చూపించాడు. బెంచీమీద పడిగాపులు కాస్తున్న ఆ జమిందారు: 'వీడా వీడు తెలుసులే—పాపం ఆ మహరాజును ఖూనీచేశారు. గొప్ప ప్రభువు అటువంటి మహావంశంలో ఈ వస్మరంతిగాడు పుట్టాడు. ఆయన అన్నకొడుకు. వాడి బుర్రల్లో యేవో వెర్రి వెర్రి సిద్ధాంతాలన్నీ పుట్టి పుచ్చిపోయింది. ఉన్నదీ మన్నదీ అంతా ఆ పేదవ జనానికి వప్పగింతచేసి యెటో దేశాల మీద పోయాడు—వట్టి సన్యాసి—వాడు యెక్కడున్నాడో యెక్కడ చచ్చాడో యెవడికి తెలుస్తుంది' అన్నాడు.

'ఏమిటే,' అంటూ ఎత్తుకున్నాడు స్ట్రియివర్: 'సిద్ధాంతాలకోసం చేతులోవున్న ఆస్తి వదులుకున్నాడంటే, నిజానికి వట్టి వాజమ్మన్నమాట.'

ఆ సంభాషణవిని, డార్నె భరించలేకపోయాడు. స్ట్రియివర్ భుజంమీద చెయ్యివేసి: 'ఇదిగో స్ట్రియివర్ గారూ! అలా తొందరపడి మాట్లాడెయ్యకండి!—ఆయన్ను నేనెరుగుదును'

'ఏమిటే! అలాగా?—చాలా విచారకరమైన సంగతి'—

'ఏమిటి అలా అన్నారూ?'

'ఆయనచెప్పిన సంగతేమిటో విన్నారా?—ఈ రోజుల్లో ఏమిటి గీగిటి అంటూ ప్రశ్నించకూడదు'

'ఎందుకు ప్రశ్నించకూడదు? అడుగుతున్నాను చెప్పండి'

'సరే చెబుతున్నాను వినండి—ఇప్పుడు మనం మాట్లాడుతున్న వ్యక్తివున్నాడు చూశారూ—ఆ స్త్రీయాత్రా దోపిడిగాళ్ళకూ హంతకులకూ, నికృష్టపు నీచులకూ వప్పగింతబెట్టి వచ్చిన ఆ వాజమ్మ, ఆదర్శాలనే అంటుడు వ్యాధతో బాధపడుతున్న రోగి; మీరు కుర్రాళ్ళతో కలసి మెలిసి తిరుగుతూ వాళ్ళకు విద్యాబుద్ధులు చెప్పి పైకి తీసురావలసిన పెద్దమనుషులు—మీకు అలాంటి వ్యక్తితో పరిచయం వుంటటమంటే విచారకరమైన సంగతికాక మరేమిటి? వాడు వట్టి లుచ్ఛామనిషనీ, అది, భయంకరమైన అంటువ్యాధి అనీ నా ఉద్దేశం—అందుకనే ఈ నా విచారం'

'మీరు ఆయన్ను అర్థంచేసుకోలేకపోవచ్చు' అన్నాడు డార్నె, హృదయంలో ఉబుకుతున్న ఆవేశాన్ని అణచుకుంటూ.

'నాకు అర్థంకాకపోవటమేమిటి లెద్దురూ? పెద్దమని

(43-వ పేజీ చూడండి)

# మా ఇంటివాళ్లు

శ్రీమతి కొమ్మూరి ఉషారాణి

రవి అన్నయ్యకు పెళ్ళయిన కొత్తరోజులు. మేము ఉన్న యిల్లు చిన్నదిగా వుందనీ కొత్తయింట్లోకి మారకపోతే వీలు లేదనీ అమ్మ పోరుపెట్టగా నాన్న యిళ్ళ కోసరము అన్వేషణ ప్రారంభించారు. వెతగ్గా వెతగ్గా కోడంబాకములో ఒకయిల్లు దొరికింది. ఇల్లు చూడటానికి నేనూ, అమ్మా, కాలేజీ చదువు కోసరము మాయింట్లో మకాం పెట్టిన పిన్నికూతురు గిరిజా బయలుదేరాము. దూరాన్నుంచి చూడటానికి ఇల్లు చాలా అందంగా వుంది. పెద్దతోటా, మధ్యన నీలం బంగళా. క్రింది భాగం ఖాళీగా వుంది. పైన ఇంటివాళ్లున్నారు. అద్దె రూ 70 అయినా ఇల్లు విశాలంగా వుంది. ఇల్లు దొరకని ఈ రోజుల్లో మద్రాసులో అంత మంచియిల్లు దొరికినందుకు అమ్మా, నేనూ మురిసిపోయాము.

ఇల్లు చూడటము పూర్తయిన తరువాత మేడమీదికి వెళ్ళాము. నల్లగా, లావుగా పొడుగ్గా, అరవకట్టుతో ఒకముతక చీర కట్టుకుని ఒకావిడ ఎదురొచ్చింది. అంత లావు శరీరానికి తగట్టు చిన్న తలకాయ, సన్నని వాలుజడ, కళ్ళజోడు, ముక్కుపుడక ఆవిడని మరింత విచిత్రంగా చేశాయి. ఆవిడ్ని చూడగానే గిరిజ ఫక్కున నవ్వింది. నేను కనుసంజ్ఞ చేశాను నవ్వవద్దని. ఆవిడే ఇంటావిడనీ, ప్రక్కగదిలో గొంతు చించుకుని పాట నేర్చుకుంటున్న పదేళ్లపిల్ల ఆమె కూతురనీ అమ్మ చెప్పింది. అరవభాష మాకు అంత బాగా తెలియకపోయినా ఆవిడ చాలా కలివిడి మనిషియని మాకు తోచింది.

ఆవిడదగ్గిర శెలవు తీసుకుని మేము బయట పడేటప్పటికి ఏడుగంట లయింది. గేటు దాటుతో ఎందుకో వెనక్కి తిరిగి చూశాను. పయిన బాల్కనీలో ఆవిడ పక్కన సన్నగా, పొడుగ్గా తెల్లగా ఒకాయన నిల్చుని మమ్మల్ని చూస్తున్నాడు.



పోలా అతను ఆవిడ కొడుకని అనుకున్నాను నేను. ఇంటికి వెళ్లిన ఆ తరువాత ఇల్లు ఆవిడ పేరవుందనీ, ఆ బక్కపల్చని ఆయన ఆవిడ మొగుడనీ చెపితే ఆశ్చర్యపోయాను. ఆవిడ చాలా ఐశ్వర్యవంతురాలుట. ఆవిడపేర మద్రాసులో ఇంకా మూడిళ్ళు ఉన్నాయట.



వారంరోజుల్లో మేము ఆ కొత్తయింట్లోకి మారాము. ఆ భార్యాభర్త లిద్దరూ మమ్మల్ని ఎంతో ఆదరముతో చూశారు. సాధారణముగా ఇల్లుగలవాళ్లు, చూపే అధికారగర్వాలు వాళ్ళల్లో మచ్చుకైనా కనుపించలేదు. దొడ్లో పూసిన పువ్వులూ! కూరలూ అన్నీ మాకే తెచ్చి యిచ్చేవారు. సందు దొరికినప్పుడల్లా మా ఇంటావిడ కిందకి వచ్చి మాతో కబుర్లు చెప్పేది.

ఎన్నో సదుపాయాలున్నా మంచినీళ్ళకి మటుకు దొడ్లో బావిదగ్గరకి వెళ్ళవలసి వచ్చేది ఆయింట్లో. స్నానాల గదిగూడా కొంచెం తోటపక్కగానే వుంది.

కొత్తగా మాఇంట్లో అడుగుపెట్టిన వదిన చాలా భయస్థురాలు. తను ఏమన్నా కావాలని అడగవలసి వచ్చినా, ఏమైనా చెప్పదలచుకున్నా చాలా సంకోచించేది. ఏ విషయమయినా మనసులో పెట్టుకునేదిగాని బయటకి చెప్పడానికి భయపడేది. గిరిజ అటువంటిది కాదు. మాతో చాలా చనువుగా వుండేది. ఎవరినన్నా విమర్శించడమన్నా, వంకలు పెట్టడమన్నా ఆమెకి బలేసరదా.

అవాళ పొద్దున్నే ముఖం కడుగుకుంటున్నాను. వదినెందుకో మంచినీళ్ళబిందె చంకన బెట్టుకుని దొడ్డివాకిలి దగ్గర నిల్చుని వుంది. ఎంతోసేపు ఆమె కదలకుండా వుండడముచూసి "ఏం వదినా! నీళ్లు తేలేదూ? అలా సంకోచిస్తున్నావేం?" అన్నాను. అబ్బే! ఏంలేదు." అని లోపలికి వెళ్ళిపోయింది. గుమ్మంలోంచి తొంగిచూశాను. బావిదగ్గిర దొండపాదు బాగుచేస్తున్నారు ఇంటాయన. ఒక గంటయిన తరువాత మంచినీళ్లు నేనే తెద్దామని బావిదగ్గిరకి వెళ్ళాను. మామిడిచెట్టు దగ్గిర పారతీసుకుని ఏదో తవ్వుతున్నట్లు నిల్చునిఉన్నాడు. పరాయివాళ్లనే సగ్గన్నా లేకుండా ఏగాదిగా చూశాడు నన్ను. వదిన ఎందుకు నీళ్లు తేలేదో అప్పుడు నా కర్థమయింది.

రోజూ మా స్నానాలవేళకి డాబామీదనో, తోటలోనో ఏదో పనున్నట్లు తిరుగుతూ వుండేవాడు ఆ పెద్దమనిషి. ఇహ ఆదివారం వస్తే యింటిచుట్టూ తిరిగేవాడు యేమైనా కిటికీల్లోంచి కొంచెము కనపడతామేమోనని. సాయంత్రము ఆఫీసునుంచి ఇంటికి వచ్చేటప్పుడు పొరపాటునన్నా నేను బయట అరుగుల మీద కూర్చుని




షావుకారు కొడుకుతో: "అదేమిట్రా పెద్దబ్బాయ్! బెల్లం డబ్బా మీద మిరపకాయలు అని రాశావ్?

కొడుకు: లేకపోతే చీమలు పట్టేస్తాయినాన్నా!"

వుంటే, మమ్మల్ని చూసుకుంటూ వెళ్ళేవాడు. భార్య పక్కనున్నప్పుడు మటుకు తలకాయ దించుకుని వెళ్ళేవాడు ఆమహానుభావుడు. ఒకసారి గిరిజ స్నేహితులతో బయట టెన్నిసు ఆడుతోంటే, "వెరీగుడ్, వండర్‌ఫుల్" అంటున్నాడు పయిన బాల్కనీలోంచి.

మొదట్లో గంభీరముగా ఉన్నా మెల్లిగా నేనూ గిరిజా ఆయనసంగతి చెప్పుకుని నవ్వుకునే వాళ్లము. ఎంతో బ్రతిమాలగా వదినగూడా తనవంక అతను అలాగే చూస్తాడని చెప్పింది బెదురుతూ! మా ముగ్గురికీ ఇదొక తమాషా అయిపోయింది. మంచినీళ్ళకి వెళ్ళవలసినా, స్నానాలకి వెళ్ళవలసినా ఒకాళ్లం గుమ్మవగ్గిర నిల్చుని ఇంటాయన లేకుండా చూస్తుంటే మరొకళ్ళం వెళ్ళేవాళ్లము. అన్నిటికంటే బాధకరమయిన విషయం ఆయన్ని గురించి గట్టిగా మాట్లాడుకోటానికి మాకు అవకాశం ఉండేదికాదు. "ఊరుకోండే. ఆవిడ వింటే ఏమైనా అనుకుంటుంది. వాళ్లు ఇంటివాళ్లు, అట్టే మాట్లాడితే ఇంట్లోంచి వెళ్లమంటారు. మళ్ళీ మనకింత చక్కని ఇల్లు దొరకదు" అనేది అమ్మ. నవ్వులాటలకెప్పుడయినా గిరిజ అన్నయ్యతో ఆయన విషయం ఎత్తితే "ఛీ! తప్పు, ఆయన పెద్ద మనిషి. పయిగా పెద్ద ఆఫీసరు. ప్రతివాళ్ళనీ అలా అనుమానించడము తప్పు. అందరు మగవాళ్ళు మీవంక చూస్తున్నారని ఎందుకు అపోహ పడాలి? మీరేమయినా అప్సరసలా? పయిగా వాళ్లు ఇంటివాళ్లు" అని మందలించేవాడు.

ఒకసారి మాటల సందర్భములో వాళ్లాయనికి చిన్నపిల్లలంటే చాలా విసుగని చెప్పింది మా ఇంటావిడ. ఒకరోజు సాయంత్రము నేనూ గిరిజా చిట్టితమ్ముణ్ణి తీసుకుని ఆషికారునుంచి వస్తుంటే, ఆఫీసునుంచి తిరిగి వస్తున్న ఇంటాయన మాకు ఎదురుపడ్డాడు. దగ్గరికి వచ్చిన తరువాత తమ్ముడి బుగ్గగిల్లి, ముద్దుచేసి, చేతిలోని ఫయిలు కావాలా అని అడిగాడు అరవములో. పిల్లవాణ్ని ఆయన ముద్దు చేస్తున్నంత సేపూ మేమిద్దరము అలా నిలబడిపోవలసి వచ్చింది. "పిల్లలంటే ఇష్టంలేదని చెప్పింది కదే ఆవిడ, ఇవాళ మన తమ్ముడు ఎలా ముద్దువచ్చాడు?" అంది గిరిజ నవ్వుతూ.

రానురాను ఆయన సంగతి మాకు బాగా తెలిసింది. ఆవిణ్ని పాపం ఎక్కడికీ తీసుకు వెళ్ళేవాడు కాదు. ఆదివారం సాయంత్రమవగానే నీటుగా డ్రస్సు వేసుకుని బయటికి వెళ్ళి రాత్రి పదింటికి ఇంటికి వచ్చేవాడు. ఒకరోజు ఆవిడ సినిమాకి వెళ్తానని అడుగుతోంటే "అంగె ఎల్లాం పోవాదడీ, పొరికి పసంగు ఇరుపాంగా." (అటువంటిచోట్లకి వెళ్ళకూడదే. అక్కడ పోకిరీపిల్లకాయలుంటారు) అని అరవములో జవాబు చెప్పటము మాకు వినిపించినది.

మాటల సందర్భములో ఆవిడ ఇరుగుపొరుగువారినిగురించి ఇట్లా అనేది "అదిగో ఆ పక్కింటివాళ్లు చూశారూ" ఉత్తస్వార్థపరులు ఒక మంచి చీరయినా కట్టుకోరు, వాళ్లతో మాట్లాడకపోతే కొంచెం వడియాలన్నా పెట్టకూడదా" అంటారు మా ఆయన. ఆ ఎదురురింటివాళ్లి మొగవాళ్లు ఆడవాళ్ళకేసి తెరగచూస్తారు. ఆ రోగిష్ఠి యింటికి అసలు వెళ్లవద్దంటారు మా ఆయన. "ఆ మూడో ఇంట్లోవున్న డాక్టరు పెళ్లాన్ని చావ బాదుతూవుంటాడు. పాపం ఆవిడ ఎలా కాపురము చేస్తోందో" అనేది.

పోనుపోను ఆవిడమీద మాకు జాలివేసేది. పాపం! ఒంటినిండా నగలు. కావలసినన్ని పట్టుచీరెలు. మొగుడు ఒక్కసారయినా ఆవిడతో నవ్వుముఖంతో మాట్లాడటము మేము చూడలేదు. ఎక్కడికయినా స్నేహితుల యిళ్ళకి వెళ్లవలసివస్తే భర్త ఆఫీసుకి వెళ్లినతరువాత మధ్యాహ్నం ఒంటిగంటకి బయలుదేరేది. సాయంత్రం ఆరుగంటలలోపు పక్కచూపులు చూసుకుంటూ ఇంటికి వచ్చేది. ఎప్పుడయినా ఆలస్యంగా ఇంటికి వస్తే "అవరు వందుటారా?" (ఆయన వచ్చారా) అని కిటికీలోంచి మమ్మల్నడిగి, వగర్చుకుంటూ పైకి పరుగెత్తేది. అతనుండగా కిందికివచ్చి మాతో మాట్లాడేది కాదు. పాపం ఉన్నదానిలోనే సంతృప్తి. తన మొగుడే లోకంలో కంతా మంచివాడనీ, పూరి మొగవాళ్లందరూ వుత్త వెధవలనీ అనుకునేది. అందగాడైనా తన మొగుడు మంచి నడవడి గలవాడనీ, మద్రాసులో మొగవాళ్ళందరూ మరీ పోకిరీవెధవలనీ మాతో అనేది. పదేళ్ళవారి సంసార జీవితములో అతను ఆమెకి నేర్పిన పాఠం అదే.

ఒకసారి ఇంటివాళ్ళ విషయం మాట్లాడుతూ గిరిజ ఇలా అంది "వెధవ డబ్బు కోసరమని హిడింబిని పెళ్లి చేసుకున్నాడు. అందుకనే వూళ్ళో అందరి ఆడవాళ్ళనూ అలా చూడటము. ఇద్దరికీ సుఖములేదు. అయినా డబ్బుకోసరము ఆడవాళ్ళని పెళ్ళి చేసుకునే మొగవాళ్లుగూడా వుంటారా లోకంలో?" అంది అమాయకంగా. "ఏమో ఉన్నారేమో! మన పీనల్‌కోడ్ ఇటువంటి మొగవాళ్ళకి ఏదైనా శిక్ష విధిస్తే బాగుండిపోను" అన్నాను ఆలోచిస్తూ."





శ్రీ యర్రా మురళీకృష్ణమోహన్

అది మే నెల. అంటే వేసవిసెలవలన్నమాట. మా నాన్న గవర్నమెంటు ఉద్యోగం పుణ్యమా అని నాకెక్కడా ఏడాదికి ఎక్కువ స్థిరనివాస యోగం పట్టలేదు. అందుచేతనే నే చెప్పకోతగ్గ స్నేహితులను వేళ్లమీద లెక్కపెట్టవచ్చు. సాహిత్యం అంటే చిన్నప్పటి నుంచీ చెవికోసుకోవటంవలన, స్పోర్ట్స్‌మన్ స్పిరిట్ వర్ణగింజలో అరవైయో వంతయినా నాలో ఆవిర్భవించలేదు. అందుచేతనే చాలమందిని పరిచయం చేసికోనవలసిన అగత్యంకూడా కనపడలేదు.

పూర్వం ఆ ఊళ్లో నేను ఫిఫ్తుఫారం చదివాను. అప్పుడు నాకు మహావిష్ణువనే స్నేహితుడుండేవాడు. పోనీ, వాడయినా కనిపిస్తాడేమోనని ఒకరోజున చల్లగాలికి బయలుదేరాను. బయలుదేరటం అంటే బయలుదేరానుకాని ఎక్కడ కనిపిస్తాడని వెతకటం? ఏమీతోచక, ఇన్ని కాఫీనీళ్లు పొట్టలో వేసుకొంటే మంచిదనిపించింది. వెంటనే కనిపిస్తున్న వసంతవిహార్‌లోకి పోయాను. సెర్వర్ కాఫీ తెచ్చాడు. త్రాగుతున్నాను. ఇంతలో నా వెనుకనుంచి "ఏయి! ఇది కాఫీయా పానకమా? ఇంత తక్కువ వెళావేం పంచదార? కాసిన్ని పాలూ, డికాషన్ తీసుకురా" అన్నమాటలు నాకు చిరపరిచితమయినవిగా వినపడ్డాయి. నా ప్రయత్నం లేకుండానే నా తలటువైపు తిరిగిందని వేరే చెప్పాలా!

చూడ్డునుకదా! ఇంకెవరూ! మా మణ్యంగాడు. మణ్యం నేనూ ఇంటర్ చదువుకొనేరోజుల్లో రూమ్‌మేట్సుము, నే వెనక్కు తిరగటం వాడు నావైపు చూడటం ఒక్కసారే జరిగాయో ఏమోమరి, వాడు 'ఏరోయ్! ఇక్కడ ప్రత్యక్షమయ్యావేమిటి? మీ ఫాదరుకుకాని, ఈ ఊరు ట్రాన్స్‌ఫర్ అయిందా ఏమిటి? అయితే బతికానన్నమాటే. ఎవడూ తెలిసిన మొఖంలేక చస్తున్నాను. ఆ మేట్నీలన్నా రోజూ వేయకుండా ఉన్నారు. అయితే, ఇంతకీ ప్రస్తుతం ఏంచేస్తున్నట్టు? వగైరా లేమయినా అయ్యాయా?" అంటూ వాడో ప్రశ్నల అస్త్రం వదిలాడు.

వాడి ప్రశ్నలకు జవాబులు చెప్పకొని, సాయంత్రం, రద్దీవేళ ఒక్కొక్కళ్లు గంట లేసి సేపు కూర్చుంటే ఎలా అనుకుంటున్నట్టుగా ఉన్న అయ్యరుకు బిల్లు చెల్లించుకొని బయటపడేటప్పటికి "గుంటూరు ఆత్రగడధాన్యం, ఇరవైనాలుగు కుంచాల బస్తా, సంచీతోసహా"... ......అన్న మాటలు వినపడుతున్నాయి పార్కునుంచి.

నెమ్మదిగా పిచ్చాపాటి మాట్లాడుకొంటూ పార్కు చేరాం. పార్కులో ఓమూల, సిమెంటుబల్లమీద కూలబడ్డాం; చుట్టూ అందరినీ పరికించి చూస్తూ. ఇంకా రేడియోలో "కాంబోడియాపత్తి"... అంటూనే ఉన్నాడు.

"నీకిక్కడెట్లా కాలక్షేపంఅవుతున్నదిరా? అవును కాని, నీకిక్కడెవరున్నారు చుట్టాలు" అన్నాను.

"మా అత్తారిదీ ఊరే"

అదృష్టవంతుడు అని మనస్సులో అనుకొంటూఉంటే "ఏం అదృష్టంలేరా అబ్బీ" అని ఎవరో నాలో చెప్పతున్నట్టుగా ఉంటే "అలాగా" అన్నాను వాడితో......

"ఇంకా ఎన్నాళ్ళుంటావేమిటి?"

"ఏదీ, నిన్నేగావస్తా, ఓ పదిరోజులయినా ఉండాలంటావా!"

"అప్పుడు చెప్తుండేవాడివి, ఆ మేనరికం సమంధమేనా?"

"కాదు. వాళ్ళకూ, మాకూ కట్నాలలో తేడావచ్చి మానేశాం. మేనరికం అంటే జ్ఞాపకంవచ్చింది. ఈమధ్య ఇంకో మేనమావగారింటికి వెళ్లానులే. అక్కడ ఇరవై యేళ్లువచ్చి, పెళ్ళయినా, నాకు తెలియని చిన్నవిషయం తెలుసుకున్నాను. వింటానంటే సంగ్రహంగా చెబుతాను"

"ఉన్నది ఉన్నట్టుగా నేచెప్పు. సంగ్రహం ఏఖర్మరా" అన్నాను.

ఆవగింజంత దాన్ని ఆనపకాయంత చేసి చెప్పటం అనవాయతే మావాడికి. వాడు "చిన్న సంఘటన" అంటే అదసలు లెక్క చేయవలసినదిగా తక్కిన వాళ్ళకు ఉండనే ఉండదు. అయినా అందులో ఏదో నగ్నసత్యం మాత్రం ఉంటుందనటాని కెంతమాత్రం సందేహంలేదు. మేం చదువుకొనే రోజులనుంచీ, వాడు చెప్పే ప్రతిమాటా ఎక్కువ ఆత్రుతతో కాకుండా, ఎక్కువ పరాకుగా కాకుండా, మధ్యరకమయిన కుతూహలంతో వినటం నాకు పరిపాటయింది.

మావాడు ప్రారంభించాడు. వాడి మాటల్లోనే చెబితే బాగుంటుంది:

నేను మామయ్యను చూసి చాలకాలం అవటంవలన ఒక శుభముహూర్తాన బయలుదేరాను. స్టేషనుకి వెళ్ళేసరికి, మెయిల్ ఆరుగంటల లేటుతోనూ, రైల్వే భాషలో నైన్‌డవున్ అనబడే బండి అయిదున్నరగంటల లేటుతోనూ, రావచ్చునని స్టేషనుమాస్టరు చల్లగా చెప్పాడు. రైల్వేవాళ్ళని తిట్టుకొంటూ కారు స్టాండ్‌కి వెళ్ళాను. ఇప్పుడంటే ఇప్పుడే వెళ్ళిపోయిందండి ఓకారు మళ్ళీ ఓ గంటలో ఇంకొకటి బయలుదేరుతుందని అన్నాడు ఓబ్రోకరు మహాశయుడు. గుఱ్ఱబళ్ళలో అయ్యే ప్రయాణం కాదు కమక, విమానంమీద వెళ్ళే భాగ్యం భారతీయుల కింకా పట్టలేదు కనుక, గంటతర్వాత బయలుదేరనున్న కారులో సామాను పెట్టించి అందులోనే కూలబడ్డాను.

"కలియుగే ప్రథమపాదే" అనటం మాని వేసి "కలియుగే ద్వితీయపాదే" అని పురోహితులు ఎన్నాళ్ళకు అంటారో కాని, నాకాకారులో ఉన్న గంటన్నరలోనూ ఓ కలియుగమే గడచిపోయినట్టయింది. చచ్చి చెడి చాయంగల విన్నపముతో గంటకన్నది గంటన్నర తరువాత, పిప్పళ్ళ బస్తాలా తయారయి బయలుదేరింది. ఇంటికి వెళ్ళేటప్పటికి రాత్రి ఎనిమిదయింది.

"ఎన్నింటికి బయలుదేరావు?"

"మధ్యాహ్నం పన్నెండుకి"

"అన్నట్టు మీ మామయ్య ఏంచేస్తున్నారు."

"పి. డబ్లి యు. డి. సబ్ డివిజనల్ ఆఫీసరు"

"అలాగా! ఇంకేం; క్రిష్టుబాలు బాగానే ఉంటుందన్నమాట" అన్నాను. ఎందుచేతంటే లంచగొండితనం అంటే కాంగ్రెసు వాళ్ళెంత చీదరించుకొంటారో, మావాడూ అంతే.

"ఓరేయి! నువ్వు మధ్య మధ్య పుల్లవేయక చెప్పేంది విను. లేకపోతే కొంపకొల్లేరవుతుంది" అన్నాడు వాడు సీరియస్ గా.

"కానీయ్ రా" అన్నా వాడికెంత్పో చెడగొట్టటం ఎందుకనిపించి.

మావాడు మళ్ళీ కథలోకి వెళ్ళాడు: అక్కడ నాకు కాలక్షేపం బాగానే అయిపోయేది. ఫస్టుక్లాసయిన రేడియోఉంది. దాంతో ఇరవై నాలుగు గంటలూ రికార్డులు వాగిస్తూ కుర్చుండేవాడిని. ఆపయిన, అప్పుడప్పుడూ ఆయనతో క్యాంపులకు బోటుమీద పోతుండేవాడ్ని. ఎంత హాయిగా ఉండేదనుకున్నావు ఆబోటు ప్రయాణం! కొబ్బరితోటల మధ్యనుండి; భూమి ఈ నిండా అన్నట్టుగా నేలకు తగిలీ తగలనట్టుగా వెల్లనుండి వ్రేలాడుతున్న మామిడి కాయలతో నిండిన మామిడితోటల మధ్యనుండీ; మధ్యలో ఒకగానిస్సు, చుట్టూ ఎడారిలా, మధ్యమధ్య ఆకుమళ్ళతోనూ చుట్టూ సస్యంలేని భూములమధ్యగానూ పోతుండే ఆకాలువపై ప్రయాణంచేస్తూ ఉదయిస్తున్న భగవానుడితో ఒకవైపు అస్తమయంలోని అరుణానితో ఒకవైపు ఉదయింపనున్న కేరాటుతో కూడిన ప్రకృతిని చూస్తూ ఉంటే, నన్ను నేను మరచిపోయి, ఎక్కడో, స్వర్గధామంలో ఉన్నట్టుగా ఉండేవాడిని.

అక్కడ రేడియో ఉందని, ఆయనతో బోటుషికారు కొట్టొచ్చని ఎంత మేనమామయితే మాత్రం, ఎన్నాళ్ళక్కడుంటాం చెప్పు. అందుకనే సమయం చూసి, "వచ్చి వారం అయింది. రేపు వెళ్తాను మామయ్యా" అన్నాను. "ఛ! తొందరేంరా! పళ్ళదువు గానిలే" అన్నాడాయన. వెళ్తామంటే చుట్టాలు ఎక్కడైనా వెళ్ళండి అంటారా? పెదవాడు చెప్పితే కాదనటం ఎందుకు, పైగా వెళ్ళి అక్కడే పెద్దగుడ్డానికి పళ్ళు తోవాలి కనుక, అనుకొని రెండు రోజుల తరువాత వెళ్ళేందుకు నిశ్చయించుకొన్నాను.

సరిగా రేపు వెళ్తాననగా ఆరాత్రి జరిగింది అసలయిన కథ. ఆరాత్రికూడా, మామూలుగానే అంతా బయట పక్కలు వేసుకున్నాం. భోజనాలయ్యాయి. బాచిగాడు పడుకున్నట్టున్నాడు. రేడియో సంగీతం స్పష్టంగా వినిపిస్తున్నది. నేను పడుకొని ఆకాశాన్ని చూస్తున్నాను. మామయ్య బయట చెయిర్ వేసుకొని ఆఫీసుపని చూసుకుంటున్నాడు. ఇంతలో మైలుకూలీ భుజంగరావు వచ్చాడు.

"దండం వండి అయ్యా" అంటూ మొదలుపెట్టాడు. "గుమ్మం పాడు లాకు దగ్గర సున్నా నాలుగుందండి. నెంబరు టూ దగ్గర సున్నా ఒకటుందండి. మీరు చెప్పినట్టే పళ్ళాలకు తగ్గించి మెరకలకు వదిలాం" ...అంటూ పాఠం వప్ప చెపుతున్నాడు.

ఇంతలో ఉన్నట్టుండి నాకు ఎక్కిళ్ళు ప్రారంభించాయి. మామూలుగా మనం ఎక్కిళ్ళువస్తే ఇన్ని మంచినీళ్ళు త్రాగుతాం. అలాగే నేనూ ఇన్ని తాగాను. ఊహుఁ మానలేదు.

"ఎక్కిళ్ళు వస్తున్నాయేమండి అబ్బాయిగారు." అన్నాడు భుజంగరావు.

"ఏమోనోయ్! నాకేమన్నా కారణం చెప్పవస్తున్నాయి కనుకనా!"

"మంచినీళ్ళు త్రాగినట్టున్నారు కూడాను, తగ్గనేలేదాండీ"

"లేదోయ్!" అంటూ నొక్కిపట్టుకున్నాను.

వాడు మామయ్యతో మాట్లాడటం పూర్తయినట్టుంది. నా క్యాంపుకాట్ దగ్గరకు వచ్చి, "అయితే, అబ్బాయిగారూ! ఆ మైలుకూలీ సుబ్బారావుని ఏదో అన్నారట ఎందుకండీ" అన్నాడు నేలను చూస్తూ.

"మైలుకూలీ సుబ్బారావునా! నేనా! ఏదో అన్నానా!" అంటూనే నిర్ఘాంతపోయి చూస్తున్నాను.

"అతను చాలా నెమ్మదయినోడండి. ఉత్తపున్నానికి మీ రెందుకన్నారా, అని నేను నమ్మలేదంటే నమ్మండి"

"అతన్నేమీ అనలేదోయ్! నీవు సరిగా విన్నావా?"

"సొంతంగా సెబుతే నేనండి, అయ్యగారి మేనల్లుడుగారు" అని.

"ఓరి పిచ్చి తగలెయ్య వీడికిదేం బుద్ధి"

"ఏమీ అనకపోతే ఎందుకంటాడురా"

అని మామయ్య అందుకున్నాడు.

ఇక నా పని ఎలా ఉంటుందో నువ్వే ఊహించుకో మతిపోయినంత పనయింది ఏం చెయ్యటం? నిజానికి ఏమీ అనందే ఎందుకంటాడు? ఒకవేళ, నాకు తెలియకుండా నే నేమయినా అన్నానేమో అని చాలసేపు జ్ఞాపకం చేసుకుంటున్నా జ్ఞాపకానికి వస్తేనా! అసలు చెయ్యనిపని గుంటుకున నేమిటుకు జ్ఞాపకం వస్తుందా!

"నువ్వెళ్ళి ఆ సుబ్బారావుని లాక్కురా.

సంగతేమిటో తేల్చుకొంటేనేకాని లాభంలేదు" అన్నాను కొంచెం కోపంగా. వస్తున్న ఎక్కిళ్లి నాపుచేసుకొంటూ.

"ఇప్పు డెందుకులెండి. రేపు చూసుకోవచ్చు. అసలు నేనూ మిమ్మల్ని అడిగేవాణ్నే కాదు. కాని వాడు కల్లంపట నీళ్లతో చెప్పాడు కనుక ఏంటో అని అడిగానంతేనండి"

నాకు నిజంగా పిచ్చెక్కింది. పొద్దున్న లేచి ఎవరిముఖం చూశానో. ఏంరా! భగవంతుడా అనుకొంటున్నాను.

"బంట్రోతోళ్ళుగదా, అని ఏమీ అనబోకండి అబ్బాయిగారూ! అడుగనక సరిపోయింది కాని, ఆ పోలిగాడయితే మొఖంమీద కుంపబద్దలు కొట్టినట్టు తెగేసి అంటాడు" అని ఆ మైలుకూలీ భుజంగరావంటూంటే నాకు వళ్లు తెలియనంతకోపం వచ్చింది. "నో ర్ముయ్! పిచ్చిపిచ్చిగా వాగక వెళ్ళి వాణ్ని తీసుకురా. వాడిసంగతీ, నీసంగతి కనుక్కుంటాను. ఏదన్నా అంటే అన్నవాడికి నాకు తెలియదాఅం'). పైగా నాకు బుద్ధులు నేర్పుతావు పెద్దమొనగాడిలా" వాడిమీద లేచాను.

"అది సరేలే కాని, నీకు ఎక్కిళ్లు పోయాయిరా!" అన్నాడు మామయ్య ఇంకలాభం లేదనుకొని.

"పోయాయి" అన్నాను వెధవ ఎక్కిళ్ళకు ఆయనంత శ్రద్ధతీసికోవటం గురించి అట్టే ఆలోచించకుండానే.

"అబ్బాయిగారు మీరు క్షమించాలి. మీరేమో ఎవర్ని అననేలేందవి. పాపం ఏమీ ఎరుగనే ఎరుగరు. అంతా నేనే కల్పించి చెప్పానండి. ఇలాగే నాకోసారి ఎక్కిళ్ళువస్తే మాఅయ్య కంగారుపెట్టేశాను, ఏదో చెయ్యనిపని చేశావని అంటూ. మీలాగే, తర్వాత ఎక్కిళ్ళు పోయినాయి. అప్పుడు చెప్పాడు ఎక్కిళ్లువస్తే మనిషిని కంగారుపెడితే పోతాయని. అప్పుడునుంచీ ఎక్కిళ్లుకి మందు ఉపయోగిత్తన్నానండి. మరే మీ అనుకోకండి. మామయ్యగారు గ్రహించేరు కాని మీరు గ్రహించలేక పోయారు." అంటూ ఓ దీర్ఘోపన్యాసం ఇచ్చాడు.

"ఓరి నిన్ను తగలెయ్య! చంపేశావు కదరా! మంచిముందే!" అనుకున్నాను. ఏంచేస్తాను కనుక.

"నాకు తెలుసురాబాబూ. నువ్వు చివరకు ఖుస్సుమనిపిస్తావు అని మొదట్లోనే అనుకున్నాను" అన్నాను మణ్యంగాడితో నవ్వుతూనే.

"ఎడిశావులే, నీకు తెలుస్తూ ఈసంగతి?" అన్నాడు వాడు.

మేష్టారు:- మన పాపాలను క్షమించమని భగవంతుని ప్రార్థించేముందు ఏంచేయాలి?

విద్యార్థి:- పాపాలు చెయ్యాలి.

* * *

మేష్టారు:- "నీవు రేపు మా ఇంటికి వచ్చితివి" అనే వాక్యం రైటా, తప్పా?

విద్యార్థి:-తప్పండి.

మేష్టారు:- ఎందుచేత?

విద్యార్థి;-మీ యిల్లెక్కడో నాకు తెలియదు కదండి.

"తెలియదు" అన్నా.

"మరింకేం. ప్రతీది తెలిసుననుకోవటం పరిపాటయింది మనకు. నిజానికి ఏమీ తెలియదు" అన్నాడు వాడు భావకవి పోజులో.

"అవును నిజమే. మనకు చిన్న విషయాలు చాల తెలియనే తెలియవు. అన్నీ తెలిసినట్టే ఉంటూ, తెలియని విషయాలను గురించి తెలిసికోవటం, ఇప్పుడు నాగరికతా చిహ్నం. అది సరేకాని, తరువాత ఏమయింది".

"ఇంకేముంది నాబొంగా, నీబొందా ఆమర్నాడు ఇంటికి వచ్చేశాను." అన్నాడు మావాడు తనకథ ముగిస్తూ

"నీ జీవితంలో అనుకోని సంఘటనలు జరుగకపోతే నీవు నీ జీవితంగురించి ఏమీ తెలిసికొనలేవు" అన్న పీటర్ చినీ మహాశయుని తలుచుకుంటూ, మంచి భాగా కాలక్షేపం అయిందనుకొని, మళ్లీ రేపు ఆ కాఫీహోటలువద్ద కలసికోనమని వాడితో చెప్పి ఇంటికిబయలుదేరా నాకే.

★



# విజ్ఞానవీధులు

"డాక్టర్"



...వీమున్నాయి అని చూడలేకపోయారు మన సిద్ధాంతులు.

గెలీలియో అనే ఇటాలియను వైజ్ఞానికుడు మూడువందల సంవత్సరాలక్రింతం తాను నిర్మించిన దూరదర్శనితో నల్లని గాజుపలక అడ్డం పెట్టుకుని సూర్యబింబాన్ని చూశాడు. పాపం చూడ్డానికి ముందు అతడికున్న సరదా చూచిన తర్వాతలేదు. తెల్లని సూర్యబింబంమీద నల్లనల్లగా చుక్కల్లాంటి మచ్చలు అగుపడ్డాయి.

నాటినుంచీ ఈ కళంకాలేమిటా అని వైజ్ఞానికులు శోధిస్తూనేవున్నారు. సూర్యబింబాన్ని దూరదర్శని సాయంతో ఫోటోగ్రాఫు తీశారు. బింబము అంచులదగ్గర గుండ్రని వర్తులములాగ కనబడక అలుక్కుపోయినట్టు కనబడింది. కాంతికూడా నూటికి అరవైపాళ్లు దరిదాపుగా తగ్గిపోయుంటోంది అంచులదగ్గర. దీనినిబట్టి సూర్యబింబంమీద వాయువులే వున్నాయని ఊహించారు. బింబం ఉపరితలము ఘనపదార్థమైనా ద్రవపదార్థమైనా అంచుల కాంతిమత్వము తగ్గడానికి కారణములేదుకదా! గోళాకారంగా వున్న బింబానికి అంచులదగ్గరనుంచి మనవైపు వచ్చేకిరణాలు ఎక్కువ దళసరిగావున్న సూర్యవాయుమండలం లోనించి చొచ్చుకుని రావలసియుండడంచేత కాంతి తగ్గిపోయివస్తాయి.

సూర్యబింబపు ఫోటోగ్రాఫులో నల్లని చుక్కలేకాక తెల్లతెల్ల (బొల్లి!) మచ్చలుకూడా కనబడతాయి. ఇవి అంచుకి చేరువగా వున్నప్పుడు సులువుగా కనబడతాయి. ఈ తెల్లమచ్చలు సూర్యుడిలోపలినుంచి పైకిలేచే అగ్నివాయువుల మబ్బులు. ఇవి 40,000 దాకా మైళ్లు పొడవూ 5000 మైళ్లదాకా వెడల్పూ వుంటాయని అంచనా.

నల్లమచ్చలు సూర్యగోళాన్ని చుట్టువుండే అగ్నివాయువులలోని కాళీలు అని వైజ్ఞానికులు కనుక్కున్నారు. సూర్యగోళాంతర్భాగములో కుంచించుకుపోయి వుండవలసిన అగ్నివాయువులు ఈ కాళీల ద్వారా బింబముపైకి తప్పుకువచ్చేస్తాయి. అంటే సూర్యుడి మచ్చలు అక్కడి వాతావరణంలోని సుడిగుండాలన్నమాట. లోపలినుంచి బయటికి బుస్సుమనివచ్చిన అగ్గిగాలులు పైనవ్యాకోచించి, చల్లబడతాయి. అందువల్ల అవి పైకివచ్చే 'బిలము' పరిసరాలకన్న కాంతి తక్కువై నల్లని మచ్చలాగ కనబడుతుంది.

ఈ మచ్చలు భూమిని మింగేశేటంత పెద్దవిగాకూడా ఉంటాయి. ఇవి అయస్కాంతాల ధృవాలలాగ జంటలు జంటలుగా ఏర్పడతాయని జి. ఇ. హేల్ కనుక్కున్నాడు. ఇవి కనబడినప్పుడు భూమిమీది అయస్కాంతసాధనాలు జల్లుజల్లు మంటాయి. ఈ 'మచ్చ'లలోంచి ఉద్గమించే శిథిలాణువులు భూమిదాకా వ్యాపించి, ఉత్తరదక్షిణ ధృవాల దగ్గర చక్కని 'అరోరా' వెలుగుల్ని తయారు చేస్తాయి.

## 34. పండుకాని పండేది?

'వీపూదిపండు' అని చిన్నపిల్లలు రాడుపుకథల్లో చెప్పుకుంటూరు. కాని వీపూదిపండు పండేమిటి? తింటామా? తినే పళ్ళేవున్నాయి పళ్లుకానివి. జీడిమామిడిపండు పండుకాదు. దానిలో విత్తనములేదు. జీడిమామిడిపిక్కనే పండు అనాలి దానిలో విత్తనముంది కనక. జీడిమామిడిపండు, అసలు పండైన పిక్కకి తొడిమమాత్రమే. కనక పండు కానిపండు జీడిమామిడిపండు అన్నమాట.

మరొక విశేషం. విత్తనమూ దాని చుట్టూవున్న గుజ్జూ (లేకపోతే సరమూ) వీటిని కప్పివుండేతొక్కా, ఈమూడూ చేరివున్న దానిని 'పండు' అంటున్నాం. ద్రాక్ష, రేగు, వేప, ఖర్జూరమూ ఈరకం పళ్లు. నేరేడూ, మామిడీ, జామా, పళ్లూ ఈ రకమే. వీటిని పళ్లు అనవచ్చుసరే. పనసా, సీతాఫలమూ, దానిమ్మ, నారింజా, (బత్తాయీ, నిమ్మ) అనాసా, పళ్లు కేవలం పళ్లుకావు. సమూహఫలాలు. పనసతోనా, నారింజతోనా, దానిమ్మతోనా, దేనికదిపండే. మనము పండుఅనేది సమూహఫలం. దానిలో పళ్లు చాలా వుంటాయి.

## 35. సూర్యబింబంలో కళంకాలా?

చంద్రబింబంలో కళంకాలు అందరూ చూచేవుంటారు. సూర్యబింబం అతి తీక్ష్ణముగా ఉండడముచేత వట్టికళ్ళతో చూడలేము. గ్రహణాల వేళ పారాణినీళ్ళలో ప్రతిఫలించే బింబాన్నో, లేక మసిపారించిన గాజు పెంకులోనుంచి కనిపించే బింబాన్నో ఆ నాలుగు ఘడియలూ చూచేవారు మనవారు. దూరదర్శినీ యంత్రాన్ని ఎరుగకపోడముచేత సూర్య బింబంలో...




## 36. ఇంద్రియాల్ని నమ్మవచ్చునా?

మనకి విజ్ఞానమంతా కన్నూ, చెవీ వంటి ఇంద్రియాల ద్వారానే లభిస్తోంది. ఈ విజ్ఞానము అన్ని పరిస్థితుల్లోనూ నిర్దుష్టముగా వుంటుందా? లేక కొన్ని ప్రత్యేక పరిస్థితుల్లో తప్పు అవుతుందా? అనీ

ప్రశ్న. ఉదాహరణానికి ఒక మనిషికి జ్వరంగా వున్నదో లేదో అని చెయ్యివేసి చూడాలనుకోండి. చెమటతోనో నీటితోనో తడిసి కొంత నానిన చేత్తో ముట్టుకుని చూస్తే మామూలు ఒళ్లు కూడా వెచ్చగా వున్నట్టే కనపడుతుంది. కాబట్టి స్పర్శ ఈ పరిస్థితుల్లో అబద్ధమాడుతుంది. ఈ సంగతినే ఇంకా చక్కగా తెలుపుతుంది. ఈ ప్రయోగము చేసి చూడండి. మూడుగిన్నెలు వరసగా పెట్టి వాటిల్లో, చన్నీరూ, గోరువెచ్చని నీరూ, కొంచెం వేడిగా ఉన్న నీరూ పొయ్యండి. చన్నీటిగిన్నెలో ఒకచెయ్యీ వేడిగా వున్న నీటిలో ఒక చెయ్యీ ముంచి కొంతసేపు ఉంచండి. రెండు చేతులకీ నీళ్ళ ఉష్ణోగ్రత అలవాటయిన తర్వాత రెండు చేతులూ గోరువెచ్చని నీటిలో ముంచండి. ఆ నీరు ఒక చేతికి వెచ్చగానూ, రెండో చేతికి చల్లగానూ వుంటుంది. కనక అలవాటు బలము త్వగింద్రియాన్ని (అంటే చర్మాన్ని) మోసపుచ్చుతున్నది. ఏ థర్మామీటరుతోనో కొలిచి చూస్తేనే గాని ఉష్ణోగ్రతా తారతమ్యము నిర్దుష్టముగా తెలియదు.

కంటిని కూడా వెర్రిగా నమ్మడానికి వీలు లేదు. ఈ క్రింది గీతలు 'యర' 'లవ'లు చూడండి. రెండింటిలో ఏది పొడవంటారూ?







కొలిచి చూడండి. రెండూ సమానమే.

ఈ క్రింది గీతలు చూడండి. పై రెండూ కుడివైపుకీ, కింది రెండూ ఎడమవైపుకీ పొడిగిస్తే కలుసుకుంటున్నట్లు కనబడుతున్నాయి. కాని మూడు రేఖలూ సమాంతర రేఖలే.



ఎంత పొడిగించినా కలుసుకోవు. రైలు పట్టాల నడుమ నిలబడి పట్టాలని దూరం దాకా చూడండి. అక్కడెక్కడో కలుసుకుంటున్నట్టు కనబడతాయి కాని అవి కలుసుకోవని మనమందరికీ తెలుసును. సోదాచేసి కొలిచి చూస్తేగాని నిజం బయల్పడదు.

ఇంకా చిత్రంగా వుంటుంది ఈ చిన్న ప్రయోగము చేసి చూడండి. ఇంట్లో దూలానికో, ద్వారబంధపు నాగవాసానికో ఒక బారెడు సైనుదారము కట్టి, రెండో కొసని చిన్న చెంబో, రాయో, కర్రబంతో, కట్టి ఊపి వదిలేయండి. ఊపులూ, ఒక్కొక్క ఊపుకి పట్టేకాలమూ గమనించండి. మొదటలో ఈ 'లోలకము' త్వరత్వరగానూ తరవాతరవాత నెమ్మదిగానూ ఊగుతుంది. "ఒకొక్క ఊపుకి ఎంతకాలము పట్టుతుంది?" అని అడిగితే సామాన్యముగా అందరూ "మొదటి ఊపుల అంతరము పెద్దది కనక వాటికి ఎక్కువ కాలమూ, చివ్వరి ఊపులు చిన్నవి కనక వాటికి తక్కువ కాలమూ పట్టుతుంద"ని చెప్తారు. వాచీ పట్టుకు చూస్తే మాత్రము అన్ని ఊపులకీ ఒకే కాలము పట్టుతుందని తెలుస్తుంది. ఇక్కడకూడా ప్రయోగము చేస్తేనే గాని నిజము తేలలేదు.

మీ బంగారపు పనివారిని "మూసనిండా బంగారమూ, ఆ మూసే నిండా పాదరసమూ తూచితే ఏది ఎక్కువ బరువుంటుందీ?" అని అడగండి. "పాదరసమే బరువ"ని జవాబు వస్తుంది. వాస్తవానికి బంగారము పాదరసముకంటె ఒకటిన్నర రెట్లు బరువు. కాసులకొద్దీ బంగారము చేత్తో పట్టుకోడము అలవాటుండవచ్చును కాని బుడ్లలతో పాదరసము వాడడము వారికలవాటు లేదు. చిన్న సైజు బిందువులలో వుండే పాదరసపు బరువు బాగా అని వుండడముచేత వారికి పాదరసమే బరువనిపిస్తుంది. సోదా చేసి చూస్తేనే గాని నిజము తెలియదు.

గెలీలియో పదిహేడో శతాబ్దములో చేసిన ప్రయోగము, ప్రయోగముల ప్రాముఖ్యతని వెల్లడిచేస్తుంది. ఎత్తైన చర్చి గోపురముమీదనుంచి ఒక దేవదారు కర్ర గుండూ, ఇనపగుండూ, సీసపుగుండూ ఒకేమారు పడేశాడు. అన్ని గుళ్ళూ ఒక్కమారు నేలమీద పడ్డాయి! మనము లోతైన నూతిలో కర్రముక్కా రాయిముక్కా ఇనపముక్కా పడేసి ఈ నిజము తెలుసుకోవచ్చు. ప్రయోగమువల్ల నిజము తెలుస్తుందిగాని నమ్మకవల్లా పెద్దల అభిప్రాయాలవల్లా కాదు. ఆధునిక విజ్ఞానానికి ప్రయోగవిజ్ఞానమే మూలాధారము.

## 37. గోపురాల్ని పైకి లేపాలంటే?

పాలకొల్లు గోపురనిర్మాణం పూర్తి అయిన కొన్నాళ్ళకి ఆ గోపురం ఒకవైపుకి కొంచెం ఒరిగిందట. కాళహస్తి గోపురం పూర్తికాగానే గోపుర ద్వారంమీద అమర్చిన రాయి బీట వేసినదట. ఈ గోపురాలు కట్టిన శిల్పులు ఒకరి నైపుణ్యమొకరు విని, తమచిక్కు వదిలించుకునే వుపాయం కోసం ఒకరినొకరు కలుసుకోవాలని బయల్దేరి యదాలాభంగా కనకదుర్గాంబ దేవాలయంలో కలుసుకున్నారట. ఎవరి చిక్కు వారు చెప్పుకున్న తర్వాత కాళహస్తి శిల్పి "మీ గోపురానికి రెండోవైపున కాళీ జాగా లేదా?" అని అడిగేడట. అప్పుడు పాలకొల్లు శిల్పి ఇతనికి జవాబుగా "మీ దేశంలో సెనగలు దొరకవా?" అన్నాడట. ఇద్దరూ ఉత్సాహంగా వెనుదిరిగి తమ వూళ్ళకి వెళ్లిపోయారు. పాలకొల్లు శిల్పి తన గోపురానికి రెండోపక్క పెద్దచెఱువు తవ్వడమారంభించి, గోపురము ఇటు ఒరిగి తిన్నబడ్డ వెంటనే తవ్వడము ఆపేశాడట. కాళహస్తి శిల్పి తన గోపురములో విరిగిన రాయి దిగువ అంచువరకూ ఇసక కూరిన బస్తాలు దట్టింపించి, ఆపైన ఎండు శెనగల బస్తాలు గట్టిగా కూరించాడట. తరవాత గోపురాన్నంతటినీ నీటితో సెనగలు నాని పోయేవరకూ తడిపితే సెనగలు ఉబ్బి, గోపురాన్ని లేవనెత్తేయట. అవకాశము చిక్కగానే విరిగిన రాయి తీశేసి సరిగ్గా దానిలాగే తయారుచేసిఉంచిన రాతిని దూర్చి నీళ్ళపోత ఆపించాడట. సెనగలు మళ్ళీ ఎండి కుంచించుకోగానే గోపురము మళ్ళీ సరిగ్గా కూర్చుందిట.

ఈ కథ చాలా చిత్రంగా వుందికదూ! కథయొక్క నిజం ఎలాగున్నా సెనగలను ఈవిధంగా వుపయోగించడము మాత్రం వుంది. మనిషి పుర్రెలోని ఎముకల నిర్మాణాన్ని పరిశీలించి నేర్చుకోడానికి ఆధునిక వైద్యవిద్యార్థులు పుర్రెలో ఎండు శెనగల్ని దట్టించి, నీళ్లు పోస్తారు. శెనగలు ఉబ్బడమువల్ల డిప్పయెముకలన్నీ ఇంత పిసరేనా విరిగిపోకుండా ఊడివచ్చేస్తాయి!

# బస్తీ మోజు

శ్రీ పబ్బరాజు సంజీవరావు



వెంకయ్య: అబ్బాయీ! రామారావు! ఇటు రారా! ఒకమాట...

రామారావు: వస్తున్నా. ఏమిటి?

వెంక: ఆఁ! ఏమీ లేదు. మీ మామ బసవయ్య నీకు వాళ్ళ అమ్మాయిని ఇస్తాట్ట! ఏదో యీ ఎండాకాలంలో ముడిపెడితే నాకూ తీరిపోతుందని...

రా: ఇప్పుడేమి తొందరా — ఈ కాస్త పరీక్షలు అవనీయండి.

వెం: తొందరంటూ వేమిరా, తొందరని! ఏదో ఇద్దరి పెండ్లిండ్లూ చేసేద్దామని ఆయన సంకల్పము. ఇంత ఖర్చు కలిసొస్తుందని. నన్ను మూడు మాసాలనుంచి వెంటబడి అడుగుతున్నాడు. మరి యేమంటావు?

రా: ఈ సంవత్సరము ఆగండి; నాకు బి. ఏ. ఒక సంవత్సరమన్నా అయిపోతుంది.

వెం: అతనూ కుటుంబీకుడు. ఇద్దరి పిల్లల పెండ్లీ ఒక్కసారే చేస్తే అన్నివిధాలా కలిసొస్తుందని అతగాడి మిడుకులూ—ఇంతకూ నీకు ఆ పిల్ల నచ్చిందా! ఏదో పూర్వంనించీ వస్తూన్న సంబంధం. నాకూ వదులుకోవడం ఇష్టం లేదు. ఈ కార్యం కాస్తా గట్టెక్కిందంటే నేనూ చీకూ, చింతా లేకుండా ఎక్కడైనా పడి వుండొచ్చు.

రా: నేను బసవయ్యమామ పిల్లను చేసుకోను.

వెం: అదేమిటిరా! ఎందుకని? రవ్వలాగా పిల్ల ఉంటే... చేసుకోనంటావేమిటి!

రా: పల్లెటూరి గబ్బిలాన్నా నన్ను చేసుకోమనటం! చదువుకున్న వాడిని; ఎవ్వరైనా చూస్తే నవ్విపోతారు.

వెం: ఎందుకు నవ్వుతారు! నవ్వే వాళ్లకు బుద్ధిలేదన్నమాట. చదువుకున్నంత మాత్రాన పూర్వమునించీ వస్తూన్న సంబంధం వదులుకోవటం మంచిది గాదు. నా మాట విను.

రా: నేనా గబ్బిలాన్ని చేసుకోను నాన్నా—ఏమైనా సరే. పూర్వంనించీ వస్తే మాత్రం చేసుకోవాలని ఉందా! ఈ రోజుల్లో అల్లాంటి పిచ్చివేషాలు పనికిరావు. పిల్లవాళ్ళ పెండ్లిండ్ల విషయంలో పెద్దలు కలుగచేసుకోవడం మానేయాలి. వాళ్ళ ఇష్టంవచ్చినవాళ్ళను చేసుకోనివ్వాలి.

వెం: ఏమిటేమిటీ? వివాహంవిషయంలో బాధ్యత లేనప్పుడు ఇతర విషయాల్లో మాత్రం మాకేం బాధ్యతుందని?...డబ్బు పంపడం, అందుకు నానా గడ్డికరవడం యెందుకూ? నీ ఇష్టం వచ్చినట్లు పూరేనే టప్పుడు డబ్బు పంపమని తెగ ఉత్తరాలు రాస్తావు, ఎందుకు పంపాలి?

రా: వివాహవిషయాల్లో, మా ఇష్టం వచ్చినట్లు మీరు నడుచుకోవాలీ అన్నాను; అంతేగాని...

వెం: ఇంతకూ ఎవరిని చేసుకుంటానంటావో చెప్పు! ఊఁ...మీ అమ్మ కూడా ఆ పిల్లను చేసుకోవాలని అంటూ ఉండేది. పాపం, దాని రోజులు తీర్చుకొని అది పోయింది. మీ అన్నయ్య చేసుకోలేదు పెద్దమామయ్య పిల్లని. దాని

(54-వ పేజీ చూడండి)

# బొమ్మరిల్లు

# "కుక్కపాలు"



శ్రీమతి జంధ్యాల స్వర్ణకుమారి

పంచాంగం తిరగేస్తూ
పట్నం నశ్యం పీలుస్తూ
పరంధామ శాస్త్రిగారు
అరుగుపైన అధిష్ఠించారు.

అంతలోనె వచ్చి పడెం
దచ్చటికో పిల్లగుంపు
బాలుడొకడు ముందుకొచ్చి
"బాబుగారు ! ఒక్కమాట
కుక్కపాలు త్రాగినాడు
ఒక్కడు మాలోనివాడు!
ఆపాపం బెట్లు మాయు
ఆ యపాయ మెట్లుబాయు
సావధానులై తెలుపుడు
స్వామి!" యనగ శాస్త్రి పలుకు

"అంత ఘోరపాపానికి
అసలు క్షమాపణ లేదోయ్



అయినా పిల్లలు గనుక
ఆలోచన చేస్తున్నా!
బంగారం పదితులాలు
బ్రాహ్మణునికి దానమిండు

ఏదో మీ మేలుకోరి
నేనె దానమందుకొందు!
పుట్టెడు బియ్యం వండి
పెట్టవలయు నందరికీ
చిల్లర మల్లర సరుకులు
చెల్లవలయు కొల్లలుగా
ఇంటికేగి పెద్దవారి
వెంటబెట్టుకొని రండి.
ఇంతకు ఆపని చేసిన
అంత ఘనుం డెవ్వడురా ?"
బాలకులంతా పకపకమంటూ

"బాబూ! మీ కొచ్చెనుతంటా
కుక్కపాలు మీకొడుకే త్రాగెను
చక్కగ చేయించండంతా-"
అనిపర్వెత్తిరి. 'ఆఁఆఁ' అంటూ
నీరసపడి శాస్త్రిగారు
నిర్విణ్ణత చెందారు.






# డాన్ క్విక్ సెట్

### పూర్వకథ

లామంచా అనే గ్రామానికిచెందిన డాన్ క్విక్ సెట్ అనే వెర్రి వెంగళప్ప ఒకనాడు తనుకూడా ఒకవీరుడు (నైట్)గా పేరుపొందాలని వుబలాటపడి, 'రోజినాంటే' అనే ఒక ముసలిగుర్రాన్ని ఎక్కి బయలుదేరాడు. ఒకానొక స్త్రీమూర్తిని ఎంచుకొని ఆమెకుతానే 'డల్సీనియా' అనేపేరు పెట్టుకొన్నాడు. ఆమెమన్నన సంపాదించటం కోసమే తాను ధర్మరక్షణమనే కఠోరదీక్ష స్వీకరించానని నమ్మాడు.

ఏవేవో పిచ్చిపిచ్చి ఆశలుచూపి శాంకోపాంజా అనే ఒక అమాయకపు కూలీని తన బంటుగా చేసుకొన్నాడు. వాడు 'డాపుల్' అనే ఒక గాడిదనెక్కి యీయన వెనకాలే బయలుదేరాడు. ఒకటి రెండు చోట్ల డాన్ క్విక్ సెట్ ఏవేవో సాహసకార్యాల చేయబోయాడు. ప్రతిసారి చావుదెబ్బలు తిన్నాడు.

ప్రథమ జైత్రయాత్రానంతరం యింటికి తిరిగివచ్చిన డాన్ క్విక్ సెట్ గారికి శాంసన్ అనే కాలేజి కుర్రాడితో పరిచయమైంది. ఆ కుర్రాడు యీయననుగురించి పత్రికలలో చదివానని చెప్పి, యీయనతో మంచిచేసుకొన్నాడు. ఆ కుర్రాడు సరదాకి వీరుడువేషంవేసుకొని, మరొక బంటును వెంటబెట్టుకొని అర్ధరాత్రివేళ ఒక అడవిలో యీయనను కలుసుకొని, కయ్యానికి రెచ్చగొట్టాడు. మరునాటి వుదయం డాన్ క్విక్ సెట్ గారు అతనితో యుద్ధంచేశాడు. ఆ యుద్ధంలో శాంసన్ గుర్రంమీదినుంచి పడిపోయి దెబ్బలుతినాడు. క్రిందపడివున్న యీతని ముఖంలో శాంసన్ పోలికలు కనుపిస్తున్నా కూడా, అదేదో మాంత్రికుడు చేసిపోయిన మాయ వల్లనే జరిగిందని డాన్ క్విక్ సెట్ గారు నమ్మాడు.

## 13

ఆ అడవి వీరుడి పొగరణిచాను కదా అన్న దిలాసాతో డాన్ క్విక్ సెట్ గారు మహా సంతోషంగా ముందుకు పోతున్నాడు. శాంకో పాంజా మాత్రం ఎట్టివిధమైన వుద్రేకమూ లేకుండా ఆయన వెనకాలే గాడిదనెక్కి వస్తున్నాడు.

వీళ్లిద్దరూ అలాగే ఆదోవని వస్తుండగా, మంచి జాతి గుర్రమెక్కి మరొక వ్యక్తివచ్చి వీళ్లతో కలిశాడు. ఆయన ఆకుపచ్చని ముఖమల్ కోటు తొడుగుకొన్నాడు. నడుముకి చాల ఖరీదైన పొడుగాటి కత్తి ఒకటి వేలాడ గట్టుకొన్నాడు. ఆ కత్తిపిడి అంతా బంగారపు ముద్దతో చేసి, దానినిండా పచ్చలు పొదిగి వున్నాయి.

వేషం, వైఖరీ చూస్తే యీయన ఎవరో రాజవంశానికి చెందిన వ్యక్తికి మల్లేవున్నాడు. ఎవరైవుంటారా అని డాన్ క్విక్ సెట్ గారు ఆలోచిస్తుండగానే, ఆవ్యక్తి గుర్రాన్ని ఆపేసి యీయనకు దణ్ణం పెట్టాడు. డాన్ క్విక్ సెట్ గారి ఆనందానికి అంతులేకపోయింది. అంత గొప్పవాడుగా కనుపిస్తున్న ఆవ్యక్తి తనకు రెండుచేతులూ ఎత్తి దణ్ణం పెట్టితే, యింక అంతకంటే ఎవరికి మాత్రం కావలసిందేముటుంటుంది! అందులోనూ ఆ వ్యక్తికూడా వీళ్లు పోతున్న వైపుకే ప్రయాణమై వస్తున్నాడేమో, యిద్దరు గుర్రాలను ప్రక్క ప్రక్కనే నడిపిస్తూ, ఆకబుర్లు యీ కబుర్లు చెప్పుకోవటం మొదలుపెట్టారు. క్రొత్తగావచ్చికలిసిన ఆ వ్యక్తిపేరు డాన్ డైగో అట; ఆమాట అతనే చెప్పాడు. ఈ భీకరానన వీర శూరాగ్రేసుడు డాన్ క్విక్ సెట్ గారు ఏకరువు పెట్టిన తన వీరవిహారానుభవాలు అన్నీవిని, ఆయన ఎంతో యిష్టపడి, వాళ్ల జమీకివచ్చి కొద్దిరోజులు వుండిపోవలసిందిగా ఆహ్వానించాడు. డాన్ క్విక్ సెట్ గారు ఆయన యిచ్చిన ఆహ్వానాన్ని స్వీకరించాడు. అట్లాగే ఆజమీకి పోదామనుకొన్నాడు. కానీ - యింతలో మరొక విచిత్రమైన సంఘటన జరిగింది. ఆ సంఘటనను ఎదుర్కోవటంలో ఆయన ప్రదర్శించిన శౌర్య సాహసాలు యింతింతనటానికి వీల్లేదు. ఇంత ఎందుకు—అటువంటి పరిస్థితులలో డాన్ క్విక్ సెట్ గారొక్కరు తప్ప, మరెవ్వరైనా వెన్ను చూపించే వాళ్లే!

అసలు జరిగినవిషయం యిది—ఆ డాన్ డైగో,

అనువాదం: **శ్రీ విశ్వాత్ముల నరసింహమూర్తి**

యీ డాన్ క్విక్ సెట్ అలా కబుర్లు ఆడుకొంటూ వస్తుంటగా, కొద్ది దూరంలో ఎత్తైనవస్తువు ఏదో ఒకటి కదులుతూ ఎదురువస్తున్నది. రంగుల జెండా లేవో గాలిలో కదులుతూ, డాన్ క్విక్ సెట్ గారికి తనను యుద్ధానికి సిద్ధం కమ్మని హెచ్చరిస్తున్నట్లుగా కనుపించాయి. ఒకటి రెండుసార్లు సకిలించి మాటలు కట్టిపెట్టి కళ్లు పెద్దవిచేసుకు ఆవైపే చూస్తూ వున్నాడు.

ఆ వస్తువు దగ్గరకు వచ్చింది. తీరా చూస్తే అదొక పెద్దబండి! అయితే యీ బండి అన్ని బళ్లకు మల్లేలేదు. బండిమీద ఏదో పెద్ద కొయ్యపెట్టె పెట్టి కట్టుంది. బండి కూసాలు అంత పొడుగున వున్నాయి. వాటి చివరలకు తగిలించివున్న ఆ జెండాలే యిందాక ఈయనగారిమీద సవాలు చేసింది. ఇంకొక విశేషం, ఆబండిమీద స్పెయిన్ దేశపు రాజుగారి ముద్రలు కూడా వున్నట్లు కనిపించింది.

యుద్ధానికి సంబంధించిన ఆలోచనలు ఒకసారి మనస్సులో మెదిలాయీ అంటే, డాన్ క్విక్ సెట్ గారు యిక మనిషి మనిషిగా వుండలేడు గా. గబగబా ఆబండికి ఎదురువెళ్లి ఆ బండివాడి గుండెలమీదికి యీటిమొన గురిపెట్టి నిల్చొని "ఎవరు నీవు? ఎందేగుచున్నావు? నీ వెవరి పనుపున ప్రయాణించుచున్నావు? ఈ శకటమునందున్న దేమి?" అంటూ వాడిపై ప్రశ్నల వర్షం కురిపించాడు.

ఆ బండివాడు బండిని ఆపేసి, యీబండి తనదేననీ, ఆపెట్టెలో, ఒరాన్ సేనాధిపతి స్పెయిన్ దేశపు రాజుగారికి బహుమానాలుగా పంపుతున్న రెండు పెద్ద సింహాలున్నాయనీ చెప్పుకొన్నాడు.

"ఏమేమీ! ఇందు సింహాము లున్నావా? ఆసింహాము లెంత పెద్దవో వివరించి చెప్పుము." డాన్ క్విక్ సెట్ గారు సంభ్రమాశ్చర్యాలతో అడిగాడు. ఇంత పెద్ద సింహాలు ఆఫ్రికా అడవుల్లో కూడా దొరకవనీ, అటువంటి సింహాలు కనుకనే రాజుగారికి బహుమానాలుగా పంపటం జరుగుతున్నదనీ ఆ బండివాడు చెప్పాడు. నిన్నటినుంచీ వాటికి తిండిఅన్నది ఏదీ పెట్టని కారణంచేత అవి ఆకలితో ఘోడు ఘోడు మంటున్నాయనీ, యిటువంటి స్థితిలో వాటిని చూస్తేనే భయం వేస్తుందని కూడా చెప్పాడు. ఆలస్యమైన కొద్దీ, ఆమృగాలు ఆకలికి ఆగలేక ఏం అఘాయిత్యం చేస్తాయో, ఏమో, చప్పున పైవూరికి పోనిమ్మని బ్రతిమాలాడు కూడాను.

ఈ మాటలన్నీ విన్న తరువాత మరొకళ్లు ఎవరైనా ఆబండివాణ్ణి పోనిచ్చేవాళ్లే. డాన్ క్విక్ సెట్ గారు అందరిలాంటి వాడా మరి? ఆ సింహాలు అంత పెద్దవి, అంత భయంకరమైనవీ అని ఆ బండివాడు అంతగా చెప్పినా కూడా యీయన మాత్రం అవేవీ లెక్కచేయలేదు. లెక్కచేయక పోగా "భీకరానన వీర శూరాగ్రేసరుడు డాన్ క్విక్ సెట్ గారు సింహబలుడని లోకమునకు చాటు అవకాశము లభించెను కదా!" అంటూ వెర్రి ఆవేశం తెచ్చుకొని ఆబండివాణ్ణి పోయి, బండి తలుపులు తెరిచి సింహాలతో తను పిలుస్తున్నానని చెప్పమన్నాడు. డాన్ క్విక్ సెట్ గారు యిటువంటి మాటలన్నీ వొళ్లు తెలిసే అంటున్నాడో, లేక ఏదైనా మైకంలో పడిపోయాడో శాంకో పాంజాకు, డాన్ డైగోకూ అర్థంకాలేదు. ఇద్దరూ చెరొక చెయ్యీ పట్టుకొని యిటువంటి తొందర పనికి దిగవద్దని ఎన్ని విధాలుగానో బ్రతిమాలి చెప్పారు. ఎంతమంది ఎన్ని చెప్పితేనేం! ఈయన పుర్రెలో పుట్టిన బుద్ధి ఓ పట్టాన పోదుగా! వీళ్లు తన మంచి కోరి అన్నివిధాల 'ఆ సింహాల జోలికి పోవద్దు,' 'వద్దు' అని చెప్పుతున్నకొద్దీ, ఆ సింహాలతో కలబడి తీరాలన్న పట్టుదల ఆయనలో అంత కంతకూ పెరిగిపోయింది. వీళ్లిద్దరూ చెప్పేమాటలు విని అయినా, యీ వీరుడు తనదారిని తనను పోనిస్తాడేమోనని ఆశతో చూస్తున్న ఆబండివాణ్ణి "ఏమిరా, బోను తలుపులు తెరిచెదవా; లేక నీ బొమికల నన్నిటినీ విరిచి ప్రోగులు పెట్టమందువా?" అంటూ డాన్ క్విక్ సెట్ గారు బిగ్గరగా అరిచేశాడు. ఆ అదలింపుకు వాడు వులిక్కిపడి, వీపు చరుచుకొన్నాడు. ఈలోగా డాన్ క్విక్ సెట్ గారు ఒరలో నుంచి కత్తిని బయటకు లాగి వాడిమీదికి రాబోతున్నాడు. వాడిక గత్యంతరం లేక బోను తలుపులు తెరవటానికి ఒప్పుకొన్నాడు.

ఆ తలుపులు తెరిచేముందు, బండికి కట్టివున్న కంచరగాడిదలను మాత్రం విప్పేసి, దూరంగా తీసుకుపోయి వదిలిపెట్టి వస్తానని బ్రతిమాలాడు. డాన్ క్విక్ సెట్ గారు అందుకు అనుమతించాడు. వాడు ఆగాడిద

(41-వ పేజీ చూడండి)




ఏ జంతువుకైనా స్వతంత్రంగా ఆలోచించే శక్తి ఎంత వున్నదీ కనుక్కోవటమంటే శాస్త్రజ్ఞులకు చాలా సరదాగా వుంటుంది. కానీ, అలా కనుక్కోవటానికి శాస్త్రజ్ఞులు చాలా యిబ్బందులు పడవలసి వుంటుంది.

సామాన్యంగా కుక్కలను పెంచేవాళ్లు, పిల్లలను పోషించే వాళ్ళూ, తమకు మచ్చికైన ఆ జీవాలలో ఒక్కొక్కప్పుడు తమ కంటే కూడా ఎక్కువ తెలివితేటలు వున్నాయని చెప్పుకొని మురిసి పోతూవుండటం జరుగుతుంది. తననే కాక, తను పెంచే కుక్కను కూడా పదిమందీ మెచ్చుకోకపోతే మనుష్యులకు సాధారణంగా తృప్తిగా వుండదు. మనుష్యులలో వుండే యీ దౌర్బల్యాన్ని గుర్తించిన గడుసువాళ్ళు, గొప్ప గొప్పవాళ్ల యింటికి ఏదైనా పనిమీద పోయినప్పుడు, ఆ గొప్పవాళ్లు చూస్తుండగా వాళ్లు పెంచుతున్న కుక్కను తెగపొగడంతో సంభాషణ ప్రారంభిస్తారు. పెంపుడు కుక్కలమీద యజమానులకు ప్రబలే మమకారం అంతకంతకూ పెరిగిపోయి, ఆ అమాయిక జీవాలని గురించి వాళ్ళే నమ్మరాని కట్టుకథలు అల్లి ప్రచారం చేస్తూవుంటారు.

అమెరికాలో ఒకసారి యిలాగే ఓ కుక్క తాలూకు యజమాని పదిమందినీ పోగుచేసి, తన కుక్క వేరొక కుక్క నీటిలో మునిగి పోతూవుంటే ఆ కుక్కకు కర్ర నొకదానిని అందించి దాని ప్రాణం కాపాడిందని చెప్పటం మొదలు పెట్టాడు. ఈ మాటలు విన్న మన స్తత్వశాస్త్రవేత్తలు 'కాబోలు' ననుకొని, ఆ మాదిరి కొన్ని పరిశోధనలు చేశారు. రెండు కుక్కలను ఏటివొడ్డుకు తీసుకుపోయి, ఒక దానిని నీటిలోకివిసిరి పారేసి, రెండో కుక్క ఏం చేస్తుందో అని చూస్తూ వుంటే, ఎన్నిసార్లు యిలా తోటి కుక్క అవతల నీటిలో పడి చచ్చే పరిస్థితిలోవున్నా, గట్టుమీద వున్న కుక్క మాత్రం వెర్రి ఎత్తినట్లు ఆ గట్టుమీదే యిటూ అటూ తిరుగుతూ పచార్లుచేసిందే కానీ, దగ్గిర నిలబడివున్న శాస్త్రవేత్తలు అందించిన కర్రను కాలితోనైనా తాక లేదు.

వెనుక ఒకసారి డార్విన్ సిద్ధాంతాన్ని పరీక్షించే వుద్దేశంతో శాస్త్రవేత్తలు జంతువుల తెలివి తేటలను నిరూపించే వుదంతాలు ఏవైనా వుంటే పంపమని ప్రజలను కోరారు. అనేక చోట్లనుంచి కోకొల్లలుగా సమాధానాలు వచ్చాయి — అన్నీ కట్టుకథలే!

అంతే కాదు — ఏ జంతువు తెలివితేటలైనా పరీక్షించదలుచుకొంటే, ముందుగా ఆ జంతువు తత్వం ఏమిటో పూర్తిగా అర్థం చేసుకోవాలి. చాలా తెలివిగా చేసిందనుకొన్న పని, ఆ జంతువుకు స్వతస్సిద్ధంగానే ఏర్పడిన ఒక లక్షణమై వుండవచ్చు.

మామూలుగా సర్కసుల్లో సముద్రపు సింహాన్ని రంగంమీదికి పట్టుకువచ్చి, దాని చుట్టూ బ్యాండు మేళం వాయిస్తారు. వాళ్ళు వాయించే ఆ పాటలకు

యీ సింహం తల తెగఆడిస్తూ, అభినయం చేస్తుంది. అదంతా చూస్తున్నప్పుడు మనకు, ఆ సింహం ఆ పాటలోని భావాన్నీ, స్వరాల ఆరోహణ అవరోహణలనీ అర్థం చేసుకొన్నదనిపిస్తుంది. నిజం మాత్రం అది కాదు. మిలమిలా మెరిసే ఒక చేపను ఆశచూపించి ఏ సముద్రసింహాన్ని అయినా, మనం మన యిష్టం వచ్చినట్లు ఆడించ వచ్చు.

ప్రకృతిలో కొన్ని రకాల జంతువులకు కొన్నిరకాలైన తెలివితేటలు పుట్టుకతోనే వస్తాయి. అలాటివి ఏవోవే ముందుగా తెలుసుకొంటేనే కాని ఏ జంతువు ఎంతవరకు స్వతంత్రంగా ఆలోచించగలదనే విషయాన్ని నిర్ణయించలేం.



అడవి యెలుక

అడవి యెలుకలనేవి మనం మామూలుగా చూచే పందికొక్కులలా వుంటాయి. వీటికి ఆహారాన్ని ఒకటి రెండు పూటలపాటు దాచుకోవడం ఎలాగో పుట్టుకతోనే తెలుస్తుంది. వానపాములు వీటికి పరమాన్నం. దొరికిన వానపామునల్లా పట్టేసి, అడివియెలుకలు వాటిని అప్పటికప్పుడే చంపివెయ్యవు. వాటి తలలను మాత్రం కొరికేసి వదలిపెట్టుతాయి. తలలు వూడిపోయిన యీ పురుగులు మరి భూమిలోకి బొరియలుచేసి దాక్కోలేవు. భూమిమీదనే పడివుండి గంటల తరబడి అలా కొట్టుకొంటూనే వుంటాయి. అడవి యెలుకలు అప్పుడు ఒకటి అప్పుడు ఒకటిగా యీ పురుగులను ఆరగిస్తాయి. కాబట్టి వీటికి దొరికిన పురుగునల్లా చంపెయ్యకుండా, వాటిని చచ్చిపోనియ్యకుండా చేసే వుపాయం తెలుసునన్నమాట.



'స్కంక్'

ఉత్తర అమెరికాలో 'స్కంక్' అనే ఒక తరహా జంతువులు వున్నాయి. వీటి ఆకారం అంతా మన వుడతలలాగే వుంటుంది కానీ శరీరప్రమాణం మాత్రం పెద్దది. ఇవి కూడా తమ తిండి విషయంలో అడివి యెలుకల మాదిరిగానే జాగ్రత పడుతాయి. వీటికి యిష్టమైన ఆహారం కప్పలు. అప్పటికి అవసరమైనదానికంటె ఎక్కువగా కప్పలు గనుక యీ జంతువుకు చిక్కితే, యిది అన్నిటినీ అప్పుడే ఎలాగూ తినివెయ్యలేదు కనుక, కొన్నిటిని మాత్రం తినేసి మిగిలిన వాటి మెదడుభాగంలో గాయం చేసి వుంచుతుంది. మెదడు దెబ్బ తిన్నా కూడా కప్పలు బాగా పదిపదిహేను గంటలసేపు బ్రతికి వుంటాయి.

సముద్రపు కాకులని ఒక రకం పక్షులు వున్నాయి. ఇవి నత్తగుల్లలను తింటాయి. గుల్లలు పగల



సముద్రపు కాకి

కొట్టటం వీటికి చేతకాదు. బాదం పప్పు తినాలనుకొన్నాక పిల్లలు బాదంకాయను గుండ్రాతిని బద్దలు కొట్టితేనే తప్ప అది కుదరదు. అలాగే యీ నత్తగుల్లలు కూడా. అందుకని సముద్రపుకాకి నత్తగుల్లలను ముక్కున కరుచుకొని దూరంగా ఎగురుతూపోయి కొండరాతిమీదికి యీ గుల్లలను అంత ఎత్తునుంచీ పడేస్తాయి. గుల్ల పప్పుపప్పు అయిపోతుంది. అప్పుడు యీ పక్షి క్రిందికి దిగివచ్చి గుల్లలో దాక్కొని వున్న నత్త పురుగును చప్పరించి తింటుంది. ఇలా చేస్తేనే కాని నత్తగుల్లలు తినటం పడదని సముద్రపు కాకికి పుట్టుకతోనే తెలుసు.

తిండి విషయంలోలాగే ప్రాణం కాపాడుకొనే విషయంలో కూడా కొన్నికొన్ని తరహాల జంతువులకి చాలా తెలివైన పద్ధతులు పుట్టుకతోనే తెలుసు.



ఆఫ్రికన్ వార్టు

ఆఫ్రికాలో వార్ట్ అనే ఒకరకం పళ్ళపంది వున్నది. ఇది భూమిలో పెద్దసొరంగాలు త్రవ్వి అందులో వుంటుంది. దీనికి చిరతపులులంటే చెడ్డభయం. పైగా దీనికి వెనుకభాగంమీద దెబ్బ తినటం అంటే యిష్టం లేదు. అందుకనే సొరంగంలో దూరేటప్పుడు మిగిలిన అన్ని మృగాలలాగా ముందుగా ముట్టెను దూర్చకుండా పృష్ఠాన్నే దూర్చి వెన్నక్కి నడుస్తూ లోపల దూరేస్తుంది.

అమెరికాలో చీమలు తినే జంతువు ఒకటి వుంది. దీనికి వొంటి నిండా బొచ్చు వుంటుంది. బొచ్చుతో వుండే పెద్ద తోక కూడా వుంటుంది. మృగాలన్నిటిలోకి దీని అంత తెలివితక్కువ మృగం మరొకటి వుండదనిపిస్తుంది. అయినా యిది నిద్రపోయేటప్పుడు బలే చమత్కారమైన పని ఒకటి చేస్తుంది. నిద్ర వస్తుందనగానే తన శరీరాన్నంతా పెద్ద వుండగా చుట్టేసుకొని, దానిమీద తోకను కూడా చుట్టబెట్టుకొంటుంది. అటువంటి స్థితిలో ఆ మృగాన్ని చూసిన ఏ జంతువైనా యిదేదో ఎండుటాకుల గుట్ట అని భ్రమపడి తప్పుకుపోయి తిరుతుంది.

మధ్య ఆఫ్రికా ప్రాంతంలో తేనె తుట్టెమైనం తిని బ్రతికే పక్షి జాతి ఒకటి వున్నది. ఎక్కడైనా 'చితారుకొమ్మను మిఠాయిపొట్లం' దీని కంటపడితే యిది పనిగట్టుకు ఆ ప్రదేశమంతా ఒకవిధమైన శబ్దం చేస్తూ ఆకాశంలో ఎగురుతుంది. ఆ శబ్దం విని మిగిలిన జంతువులు, పక్షులు, దగ్గరలో ఎక్కడో తేనె తుట్టె వున్నదని గుర్తించి, వెతుక్కొంటూపోయి, తుట్టెను పడగొట్టి తేనె తాగేసి, వాటి దారిని అవి పోతాయి. అప్పటివరకూ గోతి దగ్గర నక్కమాదిరిగా పొంచివుండే యీ పక్షి అప్పుడు ముందుకువచ్చి తుట్టెలో మిగిలివున్న మైనాన్ని అంతటినీ తినేస్తుంది.

చీమలు అంత చిన్న జీవాలు కదా! మనం మన యిళ్లల్లో ఆవులనూ, పాలేర్లను అట్టే పెట్టుకొన్నట్లే యీ చీమలు కూడా అవి వుండేచోట కొన్ని జీవాలను తమ బానిసలుగా చేసుకు సాకుతుంటాయనీ, అవి కొన్నిరకాలైన పంటలు కూడా పండించుకొంటాయని న్యూయార్క్ విశ్వవిద్యాలయానికి చెందిన షినెర్లా అనే శాస్త్రవేత్త కనిపెట్టాడు.

పైన చెప్పిన వుదాహరణలను బట్టి జంతువులు కొన్నికొన్ని తెలివైన పనులను చేయుటం పుట్టుకతోనే నేర్చుకొన్నవని ఋజువు అవుతుంది. పుట్టుకతో వచ్చిన లక్షణాలు కొన్ని, వాటి అవసరం లేకపోయినా పోవు. కుక్కలు మనుష్యులతో కాపురం చెయ్యని కాలంలో అడవిలో తిరుగుతూ, పడుకొనే సమయానికి పచ్చిక బయలులో ప్రదక్షిణాలు చేసి చేసి, ఆ పచ్చిక అంతా కొంతమట్టుకైనా చదునైనాక పడుకొనేవి. ఆ అలవాటు మూలంగానే యిప్పుడు మన యిళ్లల్లో మెత్తటి పరుపులమీద పడుకొనే అదృష్టం వాటికి అబ్బినా కూడా, యీ కుక్కలు, శుద్ధ వెర్రి మొద్దులలాగా ఆ పక్కచుట్టూ పదిమాట్లయినా ప్రదక్షిణాలు చేయ




కుండా పడుకోవు.

కొరిడీకాయలు తినే వుడతలకి సామాన్యంగా పప్పులు తిన్నాక, ఆ డొక్కులను భూమిలో పూడ్చిపెట్టడం అలవాటు. వుడతను తెచ్చి మనమెపరమైనా సాకటం మొదలుపెట్టితే, ఎంతకాలమైనాసరే వుడత ఆ డొక్కులను పూడ్చిపెట్టే ప్రయత్నం మాననేమానదు.

గొఱ్ఱెలకు ఒక అమాయకపు అలవాటు వున్నది. మందకు ముందు నడిచే గొఱ్ఱె ఎటు పోతుంటే మందలోని గొఱ్ఱెలన్నీ, ఆ పోతున్న మార్గం సరైనదా కాదా అనైనా ఆలోచించకుండా గుడ్డిగా అబాటనే పడిపోతాయి. అందుకనే కబేళాకు గొఱ్ఱెలమందను నడిపించుకుపోనటం తేలిక. ఒక్క గొఱ్ఱెనుమాత్రం ముందు నడిపించుకుపోతే చాలు; మిగిలిన మంద అంతా ఆ దారినే వచ్చేస్తుంది!

(ఇంకా వుంది)

# అంతుపట్టని అపరాధం

సుమారు ఏభై సంవత్సరాల క్రితం, ఇద్దరు (అన్నతమ్ములే నని మా తాతగారు చెప్పటం నాకు బాగా జ్ఞాపకం) దొంగతనం కూడా ఒక కళేనని, నేర్పుగా చేస్తే, ఎంత గొప్ప చోరీనైనా నిర్వహించ వచ్చునని నిరూపించేరు.

అది బహుశా 1902 వ సం॥ అయివుంటుంది. బొంబాయిలో బంగారు వ్యాపారం జరిగే పెద్ద బజారు ఒకటి ఉన్నది. విశాలమైన ఆ బజారుకు ఇరుప్రక్కలా వరుస తీరి బంగారు వ్యాపారం సాగే కొట్లు ఉన్నాయి. అక్కడ ప్రతి రోజూ లక్షలమీద వ్యాపారం జరుగుతుండేది. ఇటువంటి చోట మెసిలే మనుష్యులు చాలా జాగ్రత్తగా ఉంటూంటారు. పోలీసులు కూడా ఈ ప్రదేశాన్ని బహు జాగ్రత్తతో, కాపలా కాస్తూవుంటారు. వ్యాపారస్తులు కూడా ఘూర్ఖాలను కాపలా పెట్టకొనే వారు. ఇటువంటి చోట దొంగతనం చెయ్యటం చాలా కష్టం.

ఒకరోజు ఉదయం, ఒక ఘరానా వ్యక్తి, టిప్‌టాప్‌గా (ఆరోజులకు తగినట్లు) దుస్తులు ధరించి ఆబజారు వచ్చాడు. అతని చేతిలో చిన్న లెదర్ కేసు ఉంది. అది బరువుగా వున్నదేమో, ఆ చేతిలో నుంచి ఈ చేతిలోకీ, ఈ చేతిలోంచీ ఆ చేతి లోకీ మారుస్తూ, ఆవ్యక్తి రోడ్డు వెంట పోతున్నాడు. అతడికి 30, 40 గజాల వెనుకగా మరొక వ్యక్తి ఒక మోటారులో వస్తున్నాడు. ఒక చెయ్యి స్టీరింగ్ మీద ఉంది. రెండో చేత్తో ఒక ఎర్రని జేబురుమాలను బయటకు వేలాడవేసి పట్టుకొన్నాడు ఏదో కాలక్షేపానికి వెళ్తూన్నట్లు కారును మెల్లిగా నడిపిస్తూ మొదటి వ్యక్తిని అనుసరిస్తున్నాడు. మొదటి వ్యక్తి ఆ బజారులో కుడివైపు మొదటికొట్టు దగ్గర (ఈవైపే కొట్లు ఎక్కువగా ఉన్నాయి) ఆగాడు. మెల్లిగా మెట్లుఎక్కి యజమాని దగ్గరకు వెళ్ళాడు.

## శ్రీమంతి అందే ఆ తాళివ్ర

"దయచేయండి. ఏమి కావాలి మీకు?" అన్నాడు యజమాని.

మెల్లిగా యువకుడు తన లెదర్ కేస్ తెరిచాడు. అందులో దగ్గఱ, దగ్గఱగా 50 వేల ఖరీదుచేసే 75 బంగారు కణికెలు కుక్కబడి ఉన్నాయి. ఆ బజారులో చాలా కొట్లలో, సరిగ్గా అటువంటి కణికెలే అమ్ముతుంటారు.

"ఇవి అమ్మకానికి తీసుకు వచ్చానండి" అన్నాడు యువకుడు. కేస్ తన చేతిలోనే "ఉంగుకొని షావుకారుకు చూపిస్తూ" మొత్తం రూ 50 వేలు ఖరీదు చేస్తయ్."

"ఖరీదు మాట కేమి లెండి! బంగారం కొనడాన్కి నాకు అభ్యంతరం లేదు. కాని మీరు బంగారం ఎందుకు అమ్మవలసి వచ్చిందో, ఇంత ఖరీదుగల బంగారం మీవద్దకు ఎలా వచ్చిందో, మీరు తెలిపితే చాలా సంతోషిస్తాను" అన్నాడు షావుకారు; ఒకవైపున్న అది దొంగ బంగారమె మోనన్నే అనుమాన మున్నా, అందఱినీ అనుమానించ వలసిన మనస్తత్వం, తనకు వ్యాపార లక్షణంగా అలవడి నందుకు విచారిస్తునానన్న 'భావం వ్యక్తపరుస్తూ.

"ఆ! మరేమీ లేదు. నేను విదేశాలతో వర్తక వ్యాపారాలు చేస్తాను. మాది గౌరవంగా బ్రతికే మహారాష్ట్ర కుటుంబం. ఎప్పుడో 8 నెలల క్రితం, భార్యా బిడ్డలకు ఆభరణాలు చేయిద్దామని ఈ బంగారాన్ని, ఈ బజారులోనే ఒక దుకాణంలో కొన్నాను. ఆతరవాత వ్యాపారంలో దెబ్బతిన్నా. నగలు చేయించడం పడలేదు. వ్యాపారంలో వచ్చిన ఒడిదుడుకుల మూలంగా ఇప్పుడు రొక్కం చాలా అవసరమైంది. అందు మూలాన ఈ బంగారాన్ని అమ్మవలసి వచ్చింది" అన్నాడు పెద్దమనిషి విచారాన్ని వెళ్లబెట్టుతూ. వ్యాపారస్తుడు ఆ యువకుడి మాటలన్నీ నమ్మేడు 30 ఏండ్ల వయసుకే కష్టాలు వచ్చినందుకు సానుభూతి చూపించేడు.

"మిమ్మల్ని చాలా బాధ పెట్టేను" అన్నాడు స్వరంలో క్షమార్పణ ధ్వనింపచేస్తూ.

బేరంలోకి వచ్చేరు. కాని సరిగ్గా 50 వేలు ఇవ్వాలంటాడు ఆ యువకుడు. 45 వేలు ఖరీదుచేసే కణికెలకు 50 వేలు ఇచ్చి 5 వేలు నష్టపోలే నంటాడు ఆ షావుకారు. బేరం కుదర లేదు. యువకుడు షాపు మెట్లు చరచరాదిగి ప్రక్క కొట్లోకి వెళ్ళాడు. అక్కడా ఇదే మాదిరి సంభాషణ జరిగింది. అక్కడా బేరం కుదర లేదు. ఇలాగే ఆ బజారులో కుడివైపున ఉన్న సుమారు 50, 60 కొట్లలోనూ బంగారాన్ని అమ్మ జూపేడు. ప్రతిచోటా యించుమించుగా పైన చెప్పిన సంభాషణే జరిగింది. బంగారం అమ్ముడు కాలేదు.

ఆ యువకుడు మొదట ఈ బజారులోకి వచ్చేటప్పుడు, కారులో వెంబడించిన రెండవ వ్యక్తి, ఎడమవైపున ఒక చిన్న సందు దగ్గర కారు ఆపుచేసికొని తిరిగ్గా కూర్చొనిఉన్నాడు. మొదటి వ్యక్తి, కుడిచేతి వైపు కొట్లలో అన్నిటిలోనూ బేరము కుదరనందున, ఎడమచేతి వైపు కొట్లలో బేరము సాగించడం మొదలుపెట్టాడు. కొన్ని కొట్లలో అమ్మజూపేడు; కాని బేరం ఇక్కడ కూడా సాగలేదు. మొదటి వ్యక్తి తను ఆఖరున బంగారం అమ్మజూపిన దుకాణం నుంచి బయటకు వచ్చి తన జేబురుమాలు తీసి కారు వైపు చూస్తూ మొఖం తుడుచుకొన్నాడు.

20 గజాలు దూరంలో కారు ఆపివున్న రెండవ వ్యక్తి వెంటనే కారు స్టార్టుచేసేడు. కారు కదలడం ప్రారంభించింది. మొదటి వ్యక్తి నిలబడివున్న షాపుకు ఎదురుగా, రోడ్డుమధ్యగా వచ్చింది. మొదటి వ్యక్తి ఈలోపుగా రోడ్డు మధ్యకు చేరుకున్నాడు.

అప్పటికే పగలు 11 గం॥ లు దాటిందేమో, వీధిఅంతా జన సమర్దంగా ఉంది. పోలీసులు అతి జాగరూకతతో కాపలా కాస్తూనే వున్నారు. కారులోఉన్న రెండవ వ్యక్తి చేతిలోని ఎర్ర రుమాలు ఇంకా బయటకు కనబడుతూనే ఉంది. కాని ఈసారి ఆ రుమాలు ఎడమచేతిలో ఉంది. ఆరుమాలు బయటకు కనబడేలా, చెయ్యి ఎత్తి పట్టుకున్నాడు. మొదటి వ్యక్తి రోడ్డు మధ్యకు వచ్చేటప్పటికి, సరిగ్గా కారు కూడా అక్కడకే వచ్చింది. మొదటివ్యక్తి తన దగ్గరఉన్న లెదర్ కేసును కారు వెనుక సీట్‌లోనికి విసరి వేయటం, మొదటి సీటులోఉన్న ఇంకొక లెదర్ కేసును (అచ్చంగా మొదటిదాని లాగునవే ఉన్న



దానిని) తీసికోవడం కను రెప్ప పాటులో జరిగిపోయింది.

వెంటనే మొదటివ్యక్తి, తను ఆఖరుసారి బేరమాడిన కొట్టు ప్రక్కనే వున్న ఇంకొక క్రొత్త షాపులోనికి దారితీశాడు. కారులోని రెండవ వ్యక్తి ఎర్ర రుమాలుతో మొఖంమీద ఉన్న చెమట తుడుచుకొని, తాపీగా కారును డ్రైవు చేసికొంటూ పోయాడు.

మొదటి వ్యక్తి క్రొత్త షాపులోనికి ప్రవేశించాడు. సంభాషణ మారిపోయింది. 'నాకు 75 బంగారు కణికెలు ఫలాన సైజులో కావాలి' అన్నాడు మొదటి వ్యక్తి. షావుకారు ఆ సైజులో 75 కణికెలకు 45000 అవుతుందని లెక్క కట్టి చెప్పేడు. 'సరే ఇవ్వ' మన్నాడు మొదటి వ్యక్తి.

కొట్టులో ఇద్దరు గుమాస్తాలు లెక్కలు చూచుకొంటున్నారు. షావుకారు కొడుకు, తండ్రి క్రొత్తగా కొన్న జరీ టోపీతో ఆడుకుంటూ మొఖమల్ దిండుపై కూర్చొని ఉన్నాడు. ఎప్పటిలాగే ఘూర్ఖా బయట కాపలా కాస్తూ ఉన్నాడు. యువకుడు జేబులోంచి పర్సుతీసి పట్టుకొని నిలువబడి వున్నాడు. షావుకారు 75 కణికెలను బయటకుతీసి, లెక్క బెట్టుకున్నాడు. సరిగ్గానే వున్నవి. మొదటివ్యక్తి లెదర్ కేస్‌లో కణికెలను కుక్కుకున్నాడు; ఒకచేతితో పర్సు పట్టుకునే. షావుకారు బిల్లు రాస్తున్నాడు. పెట్టె చేతిలో పట్టుకొని మొదటి వ్యక్తి నిలువబడే వున్నాడు. డబ్బుతీసి యివ్వకుండానే పర్సు మళ్ళీ జేబులో[illegible]ళ్ళి పోయింది. తీవిగా నడచి బయటకు వెళ్ళిపోయాడు. మరుక్షణమే షావుకారు అరుపులకి దద్దరిల్లి పోయిన ఘూర్ఖా బందూకుతో, వెళ్ళిపోతున్న వ్యక్తిని ఆపుచేశాడు. మొదటివ్యక్తి "ఏమిటిది ?" అని దబాయించాడు. ఘూర్ఖా మాట్లాడకుండా బందూకును మొదటివ్యక్తి గుండెలకు మరి కొంచెం దగ్గరగా జరిపేడు. ఇంతలో షావుకారు బయటకువచ్చి 'చోరీ, చోరీ' అని గట్టిగా అరవడం మొదలు పెట్టేడు.

కొద్దిసేపటికి జనం చాలామంది ప్రోగయ్యారు. పోలీసులు అధికారులు మొదటి వ్యక్తిని చుట్టేశారు. వర్తకుడు జరిగినదంతా చెప్పాడు. పోలీసు యువకుణ్ణి కూడా ప్రశ్నించారు. కాని యువకుడు తొణకకుండా, బెణకకుండా, తాను ఒక లక్షాధికారినని, దొంగతనానికి పాల్పడ వలసినంత దరిద్రం తనకి పట్టలేదని, తను ఫలానా చోట నివశిస్తున్నానని, ఒక నెల క్రితం, విదేశాలతో తాను చేసే వర్తకంలో నష్టంరాగా బొంబాయి వచ్చేశానని, భార్యా బిడ్డలు ఇంకా తమ స్వంత ఊరిలోనే ఉన్నారనీ, తనకు వ్యాపారం చెయ్యడానికి డబ్బు తక్కువయితే, సుమారు ఎనిమిది నెలల క్రితం భార్యా బిడ్డలకు నగలు చేయిద్దామని ఈ బజారులోనే ఫలానా షాపులో కొన్న ఈ బంగారం, ఈ నాడు అమ్మకానికి తెచ్చానని, అడిగిన ప్రతి పోలీసు అధికారితోను చెప్పాడు.

"అయితే ఎనిమిది నెలల

క్రితం కొన్న బంగారాన్ని భార్యా బిడ్డలకు నగలు ఎందుకు చెయ్యించ లేదు"? ఒక పోలీసు అధికారి అడిగాడు. కాని మొదటివ్యక్తికి సమాధానం రెడీగానే ఉంది.

"నా భార్య బంగారం కొన్న రెండు వారాలకు చనిపోవలసినంత జబ్బు పడింది. వరుసగా పిల్లలు కూడా జబ్బులు పడ్డారు. అందరూ రోగాలనుండి కోలుకొనే సరికి నాలుగు, ఐదు నెలలు పట్టింది. తర్వాత వ్యాపారం మందగించి, నష్టం రావడం మొదలు పెట్టింది. ఆ హడావుడిలో నగలమాటే మరచిపోయాను. తరువాత వెల్లాళ్ళ క్రితం వ్యాపారంలో పెద్ద దెబ్బ తిన్నాను. దానితో ఈ బంగారం అమ్మివేయడాన్కి నిశ్చయించుకొన్నాను. ఈ బజారులో ధర బాగా కిడుతుందన్న ఉద్దేశ్యంతో, బొంబాయి వచ్చాను"—నదురూ బెదురూ లేకుండా వచ్చింది జవాబు.

ఒకసారి అక్కడ పోగైనవాళ్ళందరి ముఖాలూ చూచాడు. తను ప్రొద్దున వెళ్లిన షాపు యజమానులందరూ కనిపించేరు. మళ్ళీ ప్రారంభించాడు.

"కావలిస్తే కనుక్కోండి, ఇక్కడ ఉన్న షాపులలో చాలామందికి ఈ బంగారం అమ్మ చూపేను. ఎవ్వరూ నేను అడిగిన ధర ఇవ్వలేక పోయారు. సరే మిగిలిన షాపులలో కూడా అడుగుదామని, ఈ షాపులోనికికూడా వెళ్లాను. కాని ఈ షావుకారుకూడా నేను అడిగిన ధర ఇవ్వటానికి ఒప్పుకోలేదు. ఇక మిగిలిన షాపులలోకూడా కనుక్కుందామని బయటికి వచ్చేను. కాని ఈ షావుకారుకు మరి ఏం దుర్బుద్ధి పుట్టిందో, - బయటకువచ్చి అఱవటం ప్రారంభించాడు. ఇంతకంటె నాకేమీ తెలియదు. ఉదయం ఎనిమిదిన్నర, తొమ్మిదిగంటలనుండి బంగారం అమ్మ చూపుతున్నాను. కావలిస్తే ఈ షావుకారులను అడిగి నిజం తేల్చుకోవచ్చు."

పోలీసులు అతడు చెప్పిన ప్రతీ అంశాన్నీ అతిజాగ్రత్తగా పరిశీలించారు. వెంటనే అతని స్వగ్రామంలోని పోలీసుల సహాయంతో అతనినిగురించి, అతని కుటుంబాన్ని గురించి తెలుసుకొన్నారు. అతడు చెప్పినదాంట్లో పొల్లు ఏమీ లేదని తెలిసింది. ఎనిమిది నెలల క్రితం బంగారం ఈ బజారులోనే కొన్నాడన్న విషయంకూడా పరిశీలించారు. అదికూడా నిజమేనని తేలింది. (మొదటి వ్యక్తిని కారులో వెంబడించిన రెండవవ్యక్తే 8 నెలల క్రితం యీయనకు బంగారం అమ్మిన వ్యక్తి అని పాఠకులు తెలుసుకోవాలి,

ఇతర షాపుయజమానులందరూ తమకు తెలిసినంతమట్టుకు, ఈ వ్యక్తి పెద్దమనిషేనని, తమదగ్గర బేరం కుదరనందున ఇతర షాపులలోనికి వెళ్ళివుంటాడని, దొంగతనం చేసే ఉద్దేశంతో వచ్చిఉండడని తెలిపారు. ఈయనపై ఫిర్యాదు చేస్తున్న షావుకారు, కొన్నాళ్ళ క్రితమే షాపు యిక్కడ తెఱిచివున్నందువల్ల, అతనినిగురించి తమకేమీ తెలియదని చెప్పేరు.

షావుకారు తనకు తెలిసినవారి అందరి పేర్లూ పోలీసులకు చెప్పేడు. పోలీసులు వారినందరినీ విచారించి షావుకారుకూడా చాలా మర్యాదస్థుడని తెలిసికొన్నారు. ఇలాటి పరిస్థితులలో దోషి ఎవరో నిర్ణయించటం కష్టమైంది. కొందరు షావుకారును అనుమానించారు. మరికొందరు మొదటి వ్యక్తినే అనుమానించారు. మిగిలినవారు ఎవరినీ అనుమానించలేక, బుర్ర గోక్కుంటూ వెళ్లిపోయారు. తరువాత పోలీసులు తగిన బలమైన సాక్ష్యమేమీ లేనందున, మొదటి వ్యక్తి తన స్వగ్రామంలో చాలా పలుకుబడి కలవాడని తెలిసినందున, అతడు ఇచ్చిన వాఙ్మూలం సరిగ్గా ఉన్నందున అతనిని అక్కడే వదలివేసారు. వర్తకునికి కాస్త హెచ్చరిక చేసి వదలిపెట్టారు. లోపలనుంచి వస్తున్న దుఃఖాన్ని ఆపుకోవాలని ప్రయత్నించి, అది చేతకాక షావుకారు, ఏడ్చేస్తూ అందరినీ తిట్టడం మొదలుపెట్టేడు.

కాలప్రవాహంలో 25 ఏండ్లు దొర్లిపోయాయి. ఎప్పుడో మరచిపోయి మరుగునబడ్డ ఈ సంగతి పోలీసుఠాణాకి ఒకరోజున వచ్చిన ఉత్తరంతో తిరిగి తలెత్తింది. ఆ వుత్తరంలో ఇలా ఉంది.

"బహుశా 25 సం॥ల క్రితం జరిగిన ఒక చోరీగురించి ఈ జాబులో వ్రాయబోతున్నాం. ఇప్పుడు మీరు బహుశా మరచిపోయివుంటారు. అప్పటి పోలీసు ఆఫీసర్లు ఇప్పుడు ఉండకపోవచ్చుకూడా.

"మేము ఇద్దరం కలిసి చిన్నప్పట్నుంచీ దొంగతనాలు చేసేవాళ్లం. క్రమంగా పెద్దపెద్ద దొంగతనాలు

చేయడం మొదలుపెట్టాం. కూటికి లేని నిరుపేదవంశానికి చెందిన వాళ్ళము, మే మిద్దరం. అటువంటిది ఈ దొంగతనాల మూలంగా ఒకటిరెండు సంవత్సరాలలోనే మా వద్ద డబ్బు బాగా సమకూరింది. మర్యాదస్తుల వేషమనే ముసుగులో, విదేశాలతో దొంగ వ్యాపారంచేసి చాలా డబ్బు సంపాదించాము. దానితో మాలో చిన్నవాడు (రెండవ వ్యక్తి) బొంబాయిలో ఒక బంగారు దుకాణాన్ని తెరిచాడు. నేనుమాత్రం విదేశ వ్యాపారం చేస్తూనేవున్నాను. కొన్నాళ్లకు వ్యాపారం బాగా దెబ్బతింది. ఉన్నదంతా ఊడ్చిపెట్టినా లాభం లేకపోయింది. డబ్బు అవసరపరిస్థితి ఏర్పడింది. బొంబాయి వచ్చాను పాతస్నేహితుడు నన్ను ఆదరించాడు. ఇద్దరం కలసి ఒక ప్లాను వేశాము. ఇద్దరమూ దొంగతనంలో ఆరితేరిన చేతులమేగా! తరువాత జరిగిన విషయాలన్నీ ఇందులోఉన్న వార్తాపత్రికల కత్తిరింపులు, ఇతర కాగితాలవల్ల తెలుస్తాయి."

ఉత్తరం చివరను వాళ్ల సంతకాలు ఉన్నాయి. తరువాత ఇల్లా ఉంది. "మేముచేసిన యీ పాపం లోకానికి తెలియచేయాలన్న మా కోరిక, మేము ముసలివాళ్ళం అవుతున్నకొద్దీ ఎక్కువయింది. మేము ఇంక ఎక్కువకాలం బ్రతకము. అందుచేత యిది బయటపెట్టుతున్నాం."

ఆ కాలంలో బొంబాయిలోని పోలీసుశాఖ పూర్తిగా తెల్లవాళ్లతో నిండిఉన్నా, అందులో కొంతమంది హిందూదేశస్థులు కూడా లేకపోలేదు. ఆ కొద్దిమంది ఆఫీసర్లలో మా తాతగారు ఒకరు. ఈ విషయం అంతా వెల్లడయ్యేసరికి, ఆయన రిటైర్ అయి, మనుమలతోను, మనుమరాండ్రతోను విశ్రాంతి తీసికొంటున్నారు.

మరునాడు ఈ విషయం అతి ప్రముఖంగా అన్ని పత్రికల్లోను ప్రచురించబడింది. ఆ ఉత్తరంతో పాటువచ్చిన న్యూస్‌పేపర్ కట్టింగ్సు కూడా, కొన్నిపత్రికలు యథాతథంగా (*Photostats*) ప్రచురించాయి. ఆ కట్టింగ్సులో 1902 నాటి ఆ సంఘటనను వివరించేవి వున్నాయి.

ఇవన్నీ చూసేరు మా తాతగారు. ఆఖరున తమను, (అప్పటి పోలీసు ఆఫీసర్లను) దద్దమ్మలక్రింద చేసిన దొంగల తెలివితేటలను, మెచ్చుకుంటూ తామేకాదు, అమెరికా పోలీసులు, ఇంగ్లీషు పోలీసులు కూడా, తమదేశంలో ఇటువంటిది జరిగివుంటే దద్దమ్మలయి పోయేవారని అన్నారు.

తమ తెలివితక్కువదనాన్ని సమర్థించుకోవడం, దాన్ని గొప్ప గొప్పవాళ్ళతో పోల్చుకోవడం మానవసహజం. మరి మా తాతగారు కూడా మానవుడేగా!

★

## తల్లిప్రాణం

**శ్రీ రావి కొండలరావు**

చెరువు పక్క చెట్టుమీద
పిట్టవొకటి గూడులోను
గుడ్లుపెట్టి వుంచింది
హాయిగాను ప్రేమతోను

చెట్టుకింది పుట్టలోను
త్రాచుపాము వున్నదీ
చెట్టుపైని గుడ్లనూ
గుట్టుగాను కన్నది

గుడ్లమీది మనసుచేత
పిట్టలేని సమయాన
పుట్టమీద బిడ్డనొదిలి
చెట్టెక్కిందతి రయాన

ఇంతలోనె గరుడపక్షి
పాముపిల్ల నెరిగింది
ముక్కుతోను పట్టుకొని
రివ్వుమనీ ఎగిరింది

అది చూచిన పెద్దపాము
'నా బిడ్డ'ని ఏడ్చింది
కిందికి దిగి బిడ్డలేక
కన్నీళ్లను కార్చింది

పరులబిడ్డ తినబోతే
తనబిడ్డే పోయింది
తల్లిప్రాణం తెలిసిందని
పుట్టలోకి పోయింది

"ఏమోయ్. నీ కెప్పుడైనా పజిల్స్‌లో బహుమతి వచ్చిందీ?"

"ఇదుగో, ఇప్పుడు వేసే దానికి వస్తే, అదొకటీ- ఇంకా రెండు వస్తే, ఆ రెండూ కలిసి మొత్తం మూడు బహుమతులవుతాయి."

## డాన్ క్విక్‌సెట్

(32-వ పేజీ తరువాయి)

లనువిప్పి దూరంగా తోలుకు పోయేలోగా మరొకసారి చెప్పి చూతామని డాన్ డైగో, డాన్ క్విక్‌సెట్ గారి దగ్గరకువచ్చి, సింహాలతో పోరాడటం ప్రమాద కరమని హెచ్చరించాడు. ఊహూ! ఆయన ఆమాట వినిపించుకోలేదు. ఇక లాభం లేదని శాంకో పాంజా, డాన్ డైగో తమ వాహనాలను ఎక్కి తాము దూరంగా తప్పుకొన్నారు. ఆబండివాడు కంచర గాడిదలను దూరంగా వదిలివేసి తాను ఒంటరిగా తిరిగివచ్చి బోను తలుపులు తెరిచేటందుకు బండిమీదకు ఎక్కాడు. డాన్ క్విక్‌సెట్ గారు మరొకసారి సకిలించి గుర్రం వీపుమీద నుంచి దిగి, కత్తి తీసి పట్టుకొని బోనుకు ఎదురుగుండా నిలబడ్డాడు.



బోను పైకెక్కిన బండివాడు గజగజ వణికి పోతూనే ఒకతలుపు పైకిఎత్తాడు. తలుపు కొద్ది కొద్దిగా పైకి లేస్తున్నకొద్ది బోనులో నుంచి సింహం కొంచెం కొంచెంగా బయటకు కనుపించుతోంది. తలుపు సాంతం పైకిపోయాక, సింహం మహా బద్ధకంగా లేచి నిల్చొని, బిగ్గరగా ఆవులించి, తాపీగా నాలికతో ముట్టిమీదపడ్డ దుమ్మునంతా తుడిచేసుకొంది. ఖణ ఖణమండే నిప్పు సుద్దల్లావున్న కళ్లు రెండూ పెట్టుకొని చూస్తూ నిల్చుండి పోయింది.

ఎంత గుండె నిబ్బరంవున్నా కూడా, మరొక మనిషి అయితే అలాంటి పరిస్థితుల్లో తారెత్తి పరుగెత్త వలసిందే. డాన్ క్విక్‌సెట్ గారు అందరి లాంటి మనిషి కాదుగా! ఈ సింహం తనమీదికి రావటమే తడవుగా దాని జూలు పట్టుకు ఆడించెయ్యగల నన్న వెర్రి నమ్మకం ఒకటి ఆయనకు బాగా వున్నదాయెను. అంచేత మనిషి ఎంతమాత్రం చలించకుండా, కత్తి చేత్తో పట్టుకొని రాతిబొమ్మలా అలాగే నిలబడే వున్నాడు. ఆ సింహం మాత్రం అంత భయంకరమైన కళ్లతోనూ, యీపీల మనిషిని చూడకుండానే ఆయన తలపైన ఆరు అడుగుల ఎత్తునుంచీ కనుపిస్తున్న చెట్ల ఆకులూ, అవీ చూస్తూ వురికే నిలబడి వున్నది. ఆ వరసను చెమటలు కక్కుతూ ఆవీరుడు, యీ వరసను మూతి నాకుతూ యీ సింహం యిలా ఒకళ్ల కొకళ్లు ఎదురు బొదురుగా బాగా ఐదారు నిమిషాలు నిలబడి పోయారు. ఎవరూ కదలలేదు. చాలాసేపు అలా గడిచాక, యీ వీరుడు అక్కడ వున్నాడన్న విషయమైనా గమనించనట్లే, - అసలక్కడ ఏమీ లేనట్లే-ఆ సింహం యింతసేపూ యిటు చూస్తూ నిలబడి వున్నదల్లా, అటుతిరిగి చడీ చప్పుడులేకుండా పడుకొని వుండిపోయింది!

డాన్ క్విక్‌సెట్ గారికి ఆవేశం ఆగలేదు. ఆబండివాణ్ణి పేరుపెట్టి పిలిచి, కర్ర ఏదైనా తెచ్చి పడుకొన్న సింహాన్ని లేవగొట్టమన్నాడు. ఆబండివాడు ఆపని మాత్రం చెయ్యకుండా సింహంతో పోరాడి, విజయం సాధించాలని డాన్ క్విక్‌సెట్ గారు పట్టిన పట్టు, సింహమే వెన్ను చూపటంతో నెగ్గినట్లేనని సద్దిచెప్పాడు. కయ్యానికి రమ్మని సవాలు చేస్తే, ఆ సవాలు అందుకోలేని సింహంతో పోట్లాడినా పోట్లాడకపోయినా కూడా విజయం యీ వీరుడిదేలే పొమ్మన్నాడు.

బండివాడు వెలిబుచ్చిన యీ అభిప్రాయం డాన్ క్విక్‌సెట్ గారికి చాలా నచ్చింది. విజయ గర్వంతో మరింత గట్టిగా సకిలించి, కత్తిని ఒరలోకి

పెద్ద శబ్దమయ్యేట్లుగా దూకేసి, "అట్లయిన ఆబోను తలుపు నిక మూసివేయుము" అంటూ ఆజ్ఞాపించాడు. అంత పిరికి సింహం సమక్షంలో వుండటంకూడా తనకు అవమానమేనన్నట్లుగా, గబగబా యివతలకు వచ్చేసి తన యీటెమొనకు రంగు రంగుల చేతిగుడ్డను కట్టి, దాన్ని ఎత్తి పట్టుకొని గాలిలో కదిలించాడు. ఇది తనకు సిద్ధించిన విజయానికి చిహ్నమన్న మాట !

ఈగుర్తు నందుకొన్న శాంకో పాంజా, డాన్ డైగో, యిద్దరూ తమ వాహనాలను ఎక్కి యీ వీరుడువున్న చోటికి వచ్చేశారు. వాళ్లిద్దరూ అక్కడకు వచ్చి రావటమే తడవుగా "ఏం జరిగిందేమిటి? ఏం జరిగింది?" అంటూ ఆత్రంగా అడిగారు. ఆబండివాడు అందుకొని, జరిగిన సంగతంతా పూస గుచ్చినట్లు చెప్పాడు. ఆ చెప్పటంలో సింహం వెనక్కు తిరిగే ఘట్టాన్ని వర్ణించేటప్పుడే వాడు కొంచెం జాగ్రత్తపడి, "యీయన గారిని చూసేసరికే ఆసింహం భయపడి పోయిందంటే నమ్మండి" అంటూ యీ వీరుణ్ణి మరింత వుబ్బేశాడు.

డాన్ క్విక్ సెట్ గారికి యింత సునాయాసంగా సమకూరిని విజయంతో, ఆయనకు వచ్చిన గర్వానికి అంతులేక పోయింది. మనిషి తెగపొంగి పొంగి పోయాడు. ఆ సంబరంలోనే ఆబండివాడి కాలాన్ని కొంత తనక్రింద వినియోగించుకొన్నందుకు గానూ, వాడికొక కాని యిమ్మని శాంకో పాంజాకు వుత్తరువు వేశాడు. అంటూనే ఆబండివాడి వైపు తిరిగి "ఓసారథీ! ఈ సింహముల నోడించిన దెవరని రాజుగారు నిన్నడిగినచో 'వీరకేసరి' డాన్ క్విక్ సెట్ గారని చెప్పుము." అంటూ వాడికొక వుత్తరువు పారేశాడు. ఎలా తట్టిందో ఏమో, యీ 'వీర కేసరి' అనే బిరుదు, తనకెంతో తగివున్నది అనిపించింది. అందుచేత యిక మీదట తనను ఎవరైనా సరే 'వీరకేసరి' అనే పిలువాలని కూడా హుకుం వేసేశాడు.

అంతటితో డాన్ క్విక్ సెట్ గారు సింహాన్ని ఎదుర్కొనే ఘట్టం ముగిసింది. మనిషి తెగ సంబరాలు పడిపోతూ, మీసాలను బాతేసి, మెలేసి గుర్ర మెక్కి కూర్చొన్నాడు. శాంకో పాంజా, డాన్ డైగోలు దారి చూపగా ముందుకు ప్రయాణం సాగించాడు.

(ఇంకావుంది)

# రెండు మహానగరాలు

(19-వ పేజీ తరువాయి)

మయినవాడు యింత తెలివితక్కువగా యెవడు ప్రవర్తించుతాడండీ! ఉన్న ఆస్తి జనానికి వప్పగింత చేసేశాడే అనుకోండి, చేసినవాడు ఆ ఊపుతీసుకుని ఆ జనాభాకు యావత్తూ నాయకుడై భైటాయించి కూర్చోవాలిగాని దేశాలమీదపోవట మేమిటండీ వాజమ్మ? మరీనా?'

ఆ ఉపన్యాసం ముగించి స్ట్రైయివర్ యింటికి బయలుదేరాడు. అక్కడున్న జమిందారులంతా ఆ గంభీరోపన్యాసం విని, చప్పట్లుచరిచి అభినందించారు. అనంతరం స్ట్రైయివరుతో పాటు యెవరిదారిని వారు వెళ్ళిపోయారు.

బ్యాంకుగదిలో లారీ డార్నే మాత్రమే మిగిలారు.

'డార్నే! ఆయనెవరో నీకు తెలుసునన్నావుగదా పోనీ యీ వుత్తరం నువ్వు తీసుకు కాస్త ఆయనకు అందజేస్తావా?' అన్నాడు లారీ.

'అలాగే; యిటు తెండి.'

డార్నే అ వుత్తరం తీసుకొని ప్రక్కనున్న టెంపుల్ బార్ ఆవరణలోకి నడిచాడు. అక్కడ ఒకచోట యేకాంతంగా కూర్చుని, ఉత్తరం విప్పి యిలా చదువుకున్నాడు:

'ఎబేయీ ఖైదు, పారిస్
జూన్, 21, 1792

'సెయింట్ ఎవర్మోండ్ ప్రభువు సన్నిధికి, ఆర్యా!

'గ్రామస్థుల చేతుల్లో బడి యెప్పటికప్పుడు ప్రాణాపాయ స్థితిలో వుంటూ చాలారోజులు గడిపాను; చివరకు నన్ను పట్టుకుని, నామీద నానా దౌర్జన్యాలూ చేశారు; అనేకవిధాల అవమానించారు; నన్ను కాలినడకను పారిస్‌కు పడలాక్కొచ్చారు. త్రోవపొడుగునా యెన్నో బాధలుపడ్డాను; అంతేకాదు; నాయిల్లూ వాకిలీ నేలమట్టం చేసేశారు.

'నేను దేశంవిడిచి పారిపోయిన జమిందారుతరఫున వ్యవహరించుతూ, ప్రజల సార్వభౌమాధికారానికి వ్యతిరేకంగా ప్రవర్తించానని నామీద నేరం మోపారు. ఇందుకుగాను, ప్రజాన్యాయస్థానంలో విచారించి నన్ను ఉరిదీయటానికి సిద్ధంగావున్నారు. ఈ ఆస్తి యావత్తూ ప్రజలకు వప్పగింత చేసేముందే లోగడ ప్రజలనుంచి రావలసిన సిస్తులన్నీ రద్దుచేశానని చెప్పుకున్నాను: కవుళ్ళ వసూలు మానివేసి చాలా కాలమైందని చెప్పుకున్నాను. కాని నా మొరాలకించినవారెవరూ లేరు. వాళ్ళు యివన్నీ వినిపించుకోలేదు. వాళ్ళు అనేది ఒక్కటేమాట—పారిపోయిన జమిందారు తరఫున వ్యవహరించావు; ఆ జమిందారు ఎక్కడున్నాడో చెప్పమంటున్నారు.

'తమరు ఎక్కడున్నారో యేమిటో నాకేమితెలుసు—కడపటి ప్రయత్నంగా, టెల్‌సన్సు బ్యాంకుద్వారా ప్రయత్నం చేస్తే ఏదైనా ఆ చూకీదొరుకు తుందేమోననే ఆశతో ఈ ఉత్తరం వ్రాస్తున్నాను. దైవకటాక్షంవల్ల ఈ ఉత్తరం మీచేతి కందితే నన్ను యీ మరణవేదనలో నుంచి బయట బడవేయించే ప్రయత్నం చేయగలరని ఆసించుతున్నాను. మీ ఆజ్ఞలను శిరసావహించి వ్యవహరించటం మినహా యిందులో నేనుచేసిన తప్పిదం మరొక టేదీలేదు; అలాగే, మీరుకూడా నాయందు ధర్మబుద్ధితో వ్యవహరించ గలరని ఆశించుతున్నాను. ఇట్లు, దురదృష్టవంతుడు, మీ గాబెల్లీ'—

ఈ ఉత్తరం చదువుకోవటంతో డార్నే మనస్సంతా వ్యాకులమై పోయింది. తన మూలంగానూ, తన కుటుంబం మూలంగానూ, పాత మారిపోతున్న గాబెల్లీముఖం, నిష్ఠురంగా జేవురించి అతని కట్టెదుట కనుపించుతున్నట్లనిపించుతోంది. ఏమిఁ చెయ్యటానికీ తోచక గిజాటుగా లేచి నిల్చుని యిటూ అటూ తిరుగుతున్నాడు.

ఈ వ్యవహారంలో తాను చేసిన పొరపాటేమిటో డార్నేకు స్పష్టంగా అర్థమౌతోంది. తన వంశంవాళ్లు పారంపర్యంగా అనేక అకృత్యాలు చేశారు. తన పినతండ్రి చర్యలంటే తనకు అసహ్యం. తాను ఆ కుటుంబానికి చెందిన వాణ్ణనిగాని, ఆ యెస్టేటుకు వారసుణ్ణనిగాని చెప్పకోవటం అతనికి కంటక మనిపించింది. ఆ ఆస్తి యావత్తూ ప్రజలకు వదిలేసి చేతులు కడిగేసుకుని యివతల బడాలనుకున్నాడు. కాని లూసీమీద వుండే మమకారంకొద్దీ, వెంటనే యింగ్లండుకు తిరిగి పోవాలనే తాపత్రయంలో, ఆ వ్యవహారాన్ని సీదాగా పరిష్కారం చేసుకోకుండా అర్థాంతంగా వదిలిపెట్టి యివతలికొచ్చాడు అతని అస్తవ్యస్త ప్రవర్తనకు ప్రతిఫలంగా యిప్పుడు అమాయకుడైన గాబెల్లీ బలికాబోతున్నాడు.

గాబెల్లీ, జీవన్మరణ సంధ్యలో నిల్చుని, డార్నే ధార్మిక గుణంమీదికి సవాలు విసిరాడు. ఆ సవాలు అందుకుని డార్నే పారిస్‌కు బయలుదేరటానికి నిర్ణయించుకున్నాడు. తాను వెళ్ళిపోయేవరకూ, లూసీకిగాని, డాక్టర్ మానెట్‌కుగాని యీ విషయం తెలియనీయగూడదనుకున్నాడు.

ఉత్తరం మడిచి జేబులోపెట్టుకుని బ్యాంకుదగ్గిరకే తిరిగొచ్చాడు. లారీ, జర్రీ ప్రయాణసన్నాహంలో వున్నారు. బ్యాంకు గేటుముందు బండి నిలబెట్టివుంది.

'లారీగారూ! మీరు యిచ్చిన వుత్తరం ఆయనకు చూపించాను' అన్నాడు డార్నే. 'వ్రాతమూలకంగా సమాధానం యేమీ అక్కర్లేదుగాని, నోటిమాటగానే ఒకముక్క తెలియజేస్తే చాలు.'

'ప్రమాదమేమీ లేదంటే—వెళ్లి ఆ వర్తమానం చెబుతాను'—అన్నాడు లారీ.

'అవతల మనిషి ప్రస్తుతం ఎబేయీ జైల్లో వున్నాడనుకోండి—అయినా యిందులో పెద్ద, ప్రమాదమైన సంగతేమీ లేదు.'

'ఆ ఖైదీ పేరేమిటన్నావ్'—

'గాబెల్లీ'

'సరే!—ఏం చెప్పమంటావ్'

'ఏమీ లేదండీ!—ఉత్తరం అందిందనీ, ఆయన వస్తానన్నారనీ చెబితే చాలు'—

'ఎప్పుడు బయలుదేరతారో ఏమిటో—ఏమన్నా చెప్పాలా?—

'రేపురాత్రి బయలుదేరివస్తారని చెప్పండి'—

ఈ సంభాషణ పూర్తికావటం తరువాయిగా, బండి కదిలి సాగిపోయింది. డార్నే నెమ్మదిగా కదిలి, లోలోపల ఆలోచించుకుంటూ సోహోస్క్వేర్ వైపు నడిచిపోతున్నాడు.





పీపుల్స వారి "పల్లెటూరు"లో శాంత (టి. జి. కమలాదేవి), సుగుణ (సావిత్రి)

# విజ్ఞానమూ - వినోదమూ

సినిమాలు విజ్ఞానానికా వినోదానికా అని పాఠకులు పలువురు ప్రశ్నిస్తున్నారు ఈ ప్రశ్న సినిమాలకే కాకుండా అన్ని కళలకూ వర్తిస్తుంది

అమెరికన్ డైరెక్టరు ఫ్రాంక్ కాప్రా ఆ మధ్య మనదేశం వచ్చినప్పుడు చెప్పాడు: "మా దేశంలో చిత్రాలన్నీ వినోదమే లక్ష్యంగా పెట్టుకుని తయారవుతున్నా"యని అంతకుముందొకసారి ఇండియా వచ్చిన రష్యన్ దర్శకుడు పుడోవ్కిన్ "మా దేశంలో సినిమాలు విజ్ఞానానికా వినోదానికా అన్న ప్రసక్తే లేదు ఈ రెండూ మాకు ప్రధాన లక్ష్యాలే" అని చెప్పాడు

ఫిలింఫేర్‌లో జెమినీ అధిపతి వాసన్ ఒక వ్యాసం రాస్తూ ఇలా ఉద్ఘాటించాడు: "సినిమాలు చూసేవారిలో రెండు రకాలవారున్నారు విదేశీ చిత్రాలను మధ్యతరగతి, పై మధ్యతరగతి, ధనికులు చూస్తారు భారతీయ చిత్రాలను మధ్యతరగతి, క్రింది మధ్యతరగతి బీదతరగతి ప్రజలు చూస్తారు. రెండవ తరగతి ప్రజల జీవితాలు నిరుత్సాహజనకంగా ఉంటాయి. అందుచేత వారు తమ ఆశలను, ఆశయాలను కొంతవరకూ ప్రతిబింబించే వినోదకర చిత్రాలను చూడగోరుతారు వారి కోరికను తీర్చటానికి మన చిత్రాలు 'ఎస్కేపిస్టు' వినోదం కలిగి ఉండటం.. అవసరం"

పై వాక్యాలలో మనదేశంలోని ఎక్కువమంది చిత్రనిర్మాతల దృక్పథం వెల్లడిఅవుతున్నది. ప్రజలు చవకరకం వినోదం మాత్రమే కోరుతారనీ, దానిని సప్లయి చెయ్యటమే తమ విధి అనీ, ఏదో ఒక విశిష్టమైన ప్రయోజనం పెట్టుకుని చిత్రం తీస్తే దానికి డబ్బు రాదని పలువురికొక అభిప్రాయం ఉన్నది అసలు విజ్ఞానమూ, వినోదమూ అనేవి పరస్పర విరుద్ధమైనవని కూడా కొందరికి దురభిప్రాయం ఉన్నది.

విజ్ఞానకరమైన చిత్రాలంటే ఏమిటి? ప్రత్యేకంగా విజ్ఞానంకోసమని చెప్పి ఎవరూ సినిమాలు చూడరు సైన్సు విషయికమైన విజ్ఞానం కావాలని కోరేవారు, మానసిక శాస్త్ర సంబంధమైన విజ్ఞానం కోరేవారు ఆయా శాస్త్రాలకు సంబంధించిన పుస్తకాలు చదువుకుంటారు అంతే కాని సినిమాల ద్వారా నేర్చుకోవాలని కోరరు కళ అనేది విజ్ఞానాన్ని ప్రత్యక్షంగా ఎన్నడూ కలిగించదు. మానవుడి కర్తవ్యాన్ని గురించిగాని, మానవస్వభావాన్నిగాని, సంఘంలోని యథార్థ పరిస్థితినిగాని, లేక ఒక గొప్ప నీతినిగాని కళ ప్రత్యక్షంగా ఎప్పుడూ చెప్పదు ప్రత్యక్షంగా చెబితే అది నీతిశాస్త్రమో, మానసిక శాస్త్రమో, ఆర్థికశాస్త్రమో అవుతుంది గాని కళ కానేరదు కళయొక్క వస్తువేదైనప్పటికీ దానిని మానవ జీవితంతోను, మానవహృదయం (*Emotions*)తోను ముడిపెట్టుకునే చిత్రించాలి కళాకారుడు నీతిని బోధించాలనే ఆశయం పెట్టుకున్నప్పుడు కేవల సందేశాలు వల్లించడు నీతికి అవినీతికి మానవహృదయంలో జరిగే యుద్ధాన్ని వర్ణించి నీతిప్రభావాన్ని చూపిస్తాడు. టాల్‌స్టాయి గొప్ప నీతివాది. ఆయన రచించిన ప్రతి నవల నీతివాదయుతంగానే ఉంటుంది అయినా ఆయన కళాకారుడు కనుక ఏ నీతినైనా మానవ జీవితాన్ని హృదయంగమంగా వర్ణించటం ద్వారానే వినిపించాడు కాని వట్టి నీతులను వల్లించలేదు ఈ విషయం సరిగా అర్థంచేసుకోకనే చాలమంది విజ్ఞానదాయకమైన చిత్రాలు తీస్తే డబ్బు రాదని వాదిస్తారు నిజమే; ఫిజిక్సు మేష్టారు క్లాసులో పాఠం చెప్పినట్టే సినిమా తీస్తే ఎవరూ చూడరు

ఇక వినోదం సంగతి ఆలోచిద్దాం మన నిర్మాతలు వినోదం పేరిట తీస్తున్న చిత్రాలలో వినోదం లేకపోగా, జుగుప్సాకరమైన సన్నివేశాలు అధికమవుతున్నాయి. కవిచేత కొన్ని పాటలు వ్రాయించుకోవటం, సంగీత దర్శకునిచేత రాగాలు పెట్టించటం ప్లేబాక్ గాయకులచేత వాటిని పాడించటం, ఆ పాటలను చిత్రంలో ఇష్టం వచ్చినచోట అతికించటం, అక్కడితో ప్రేక్షకులపట్ల తమ కర్తవ్యం ముగిసిందని భావించటం జరుగుతోంది అలాగే నృత్యసన్నివేశాలు. నృత్యాలపిచ్చి మొదట హిందీ సినిమాలనుండి తెలుగు, తమిళ సినిమాలకు పాకింది ప్రధాన కథతో ఏవిధంగా చూచినా సంబంధంలేని నృత్యసన్నివేశాలను చొప్పించటం అలవాటయింది. దీని ఉద్దేశ్యం ప్రేక్షకులకు వినోదం కల్పించటమేఅయినా, ప్రేక్షకులకు మాత్రం జుగుప్స తప్పించి మరేమీ కల్గదు.

ఎస్. కె. ఫిలిమ్స్ వారి
← "నాజ్" హిందీ చిత్రములో నళినీజయవంత్



జైమినీవారి "చిన్నమ్మ కథ"లో కృష్ణకుమారి.

వినోదం అంటే ఏమిటి? 'ఎంటర్ టెయిన్ మెంట్' అనే మాటకు అర్థముగా ఈ పదం వాడుతున్నాము. ప్రేక్షకులు చిత్రం చూస్తున్నంతసేపూ మరేవిషయం మీదకు బుద్ధిపోనివ్వకుండా చిత్రంమీదనే దృష్టిని లగ్నంచేసి వుంచితే చిత్రనిర్మాత ఆశయం నెరవేరినట్లే. ఇందుకు ముఖ్యాధారం కథ కథలో బిగువు ఉన్నట్లయితే ప్రేక్షకుని దృష్టి కొంతసేపయినా ఆకట్టి వుంచగలదు పానకంలో పుడకలలాగా పాటలు, నృత్యాలు ఎన్ని ప్రవేశపెట్టినా అందువల్ల చిత్రనిర్మాత ఆశయం నెరవేరదు. అవి అసలు కథయొక్క గమనానికి అడ్డుపడతాయి. ఆ కాసేపూ ప్రేక్షకుడు కళ్ళు, చెవులు మూసుకోవలసి వస్తుంది. అసలు కథలో బిగువులేనప్పుడు ఇటువంటి అప్రధానాంశాలతో ఆ లోపాన్ని కప్పుకోవాలని దర్శకుడుగాని, నిర్మాతగాని వృథాగా ప్రయత్నిస్తాడు

కొన్ని హద్దులకు లోబడి మన దేశంలో నిర్మాతలకు ఎటువంటి కథావస్తువునైనా ఎన్నుకొనే స్వేచ్ఛ, హక్కు ఉన్నది గొప్ప సాంఘిక ప్రయోజనంకల కథనే ఎన్నుకోవాలని ఎవరి నిబంధనా లేదు కేవలం కాలక్షేపంకోసం ఉద్దేశించబడిన కథలనే తీసుకోవచ్చు వాటినైనా సరియైన 'స్క్రీన్‌ప్లే'లుగా రూపొందించినట్లయితే జయప్రదమైన చిత్రం తయారవటానికి అవకాశం ఉన్నది కాని మన సినిమా పరిశ్రమకు పట్టిన అనర్థాలలో స్క్రీన్‌ప్లే రచయితలు సరియైనవారు లేకపోవటం ఒకటి. మన సినిమా రచయితలలో పెక్కుమందికి కథను తెరకు ఏవిధంగా మలచవలసిందీ తెలియదు మన రచయితలు చేసేపనల్లా డైరెక్టరు చెప్పినచోట మాటలు, పాటలు ఇరికించటం. స్క్రీన్‌ప్లే రచన అనేది కలం పట్టడంచేతైన ప్రతి రచయిత, లేక ప్రతి డైరెక్టరూ చెయ్యగలిగిన పని కాదు. అది ప్రత్యేకమైన టెక్నిక్. ఫిలింఫేర్ పత్రిక ఇటీవల సూచించినట్లు ఈ టెక్నిక్‌లో తర్ఫీదుపొందిన రచయితలను సినిమా పరిశ్రమవృద్ధిచేసుకుంటేనేగాని సినీ సంవినోదమైనా కలిగించాలనే ఆశయం నెరవేరదు.

విజ్ఞానమూ, వినోదమూ అనేవి రెండూ కళకు రెండు కళ్ళవంటివి ఏ ఒకటి లేకపోయినా కళ అసంపూర్ణమవుతుంది. విజ్ఞానయుతమైన చిత్రాలు తీస్తే సినిమా పరిశ్రమే నశించిపోతుందనటం ఆత్మవిశ్వాసం లేకపోవటాన్నే సూచిస్తుంది. సినిమా పరిశ్రమ ఇంతమాత్రానికే నశించిపోయేది కాదు. ఎన్ని ఒడుదుడుకులూ, ఎంత ఆర్థిక మాంద్యము సంభవించినా సినిమాలు ప్రజల దైనికావసరాల జాబితాలో చేరిపోయాయి కనక వాటికి ప్రజాదరణ ఉండనూ ఉంటుంది సినిమా నిర్మాణానికి కళాగౌరవం ఇచ్చే చిత్రాలు తయారవుతూనూ ఉంటాయి ★

# సినిమా విమర్శ.

ఏ కళనైనా విమర్శించటంలో రెండు పద్ధతులున్నాయి ఒకటి ఆంతర విమర్శ, మరొకటి బాహిరవిమర్శ-సినిమా అనేక కళలతో కూడిన కళ కనుక దానికి కూడా ఈ పద్ధతులు వర్తిస్తాయి ఆంతర విమర్శ అంటే ఏమిటి? కళను ఆ కళయొక్క అవధుల మధ్యనుంచే పరిశీలించటం ఒక నాటకం ఉన్నదనుకోండి. నాటకశిల్పం, నియమాలు, నిబంధనల దృష్ట్యా ఆ నాటకం నిర్దుష్టంగా ఉన్నదా లేదా? నాటక రచయిత పాత నియమాలను అతిక్రమించి కొత్త నియమాలు సృష్టించుకొని నాటక సౌందర్యాన్ని ఏమైనా పెంపొందించాడా, లేదా? మొదలైన విషయాలను పరిశీలించటం ఆంతర విమర్శ అవుతుంది. ఈ విమర్శ చేసే మనిషికి నాటకశిల్పాన్ని గురించి అపారమైన పాండిత్యం ఉండాలి. దాదాపు నాటక రచయితకు తెలిసినంత

నాటకశిల్పమూ విమర్శకుడికి తెలిసి ఉండాలి. అలాగే సినిమా విమర్శకూడాను సినిమా శిల్పాన్ని గురించి పూర్తిగా తెలిసినవాడే సరియైన విమర్శ రాయటానికి అర్హుడు. సినిమా నిర్మాణంలో కథాశిల్పం, నాటకీయశిల్పం, కవిత్వం సంగీతం, అలంకారశిల్పం మొదలైన అనేకం అంతర్భాగాలుగా ఉంటాయి. ఇవి కాక సినిమా నిర్మాణానికే ప్రత్యేకంగా చెందిన కెమేరా పని, సౌండురికార్డింగు, సెట్టింగులు, స్క్రీన్‌ప్లే రచన మొదలైనవికూడా అంతర్భాగాలుగా ఉంటాయి. ఇవన్నీ స్పెషలైజ్ చేసిన వ్యక్తులకే గాని కొరుకుడు పడని విషయాలు. వీటన్నిటిలోను సంపూర్ణపాండిత్యం సంపాదించటం ఏ ఒక్క మనిషికీ సాధ్యంకాని పని. అయినప్పటికీ సరియైన సినిమా విమర్శ చెయ్యదలచుకున్నవాడు వీటితో కొద్దో గొప్పో పరిచయం ఏర్పరచుకోవటం తప్పని సరి. అప్పుడే విమర్శకుడు ప్రేక్షక సామాన్యానికి అందని అందాలను గాని లోపాలను గాని ఎత్తి చూపించగలుగుతాడు. ఇటువంటి విమర్శనే ఆంతర విమర్శ అంటాము.

అయితే చాలమంది వాదించే దేమిటంటే విమర్శకుడి పని ఆంతర విమర్శ లేక శిల్పవిమర్శతో ఆగిపోతుందని; సినిమాచిత్రంలోని కథావస్తువు ఎటువంటిదైనా దాని జోలికి విమర్శకుడు పోరాదనీ. సినిమా నిర్మాతయొక్క ఆశయం నెరవేరిందో లేదో పరిశీలించాలిగాని; అతని ఆశయాన్ని విమర్శించే హక్కు విమర్శకుడికి లేదని.

కాని ఇంకొక రకమైన విమర్శకూడా ఉన్నది. అది బాహిర విమర్శ. అంటే కళను కళయొక్క అవధులమధ్య నుంచే కాక సంఘంయొక్క అవధుల మధ్యనుండి విమర్శించటం. కళ కళాకారుడి స్వీయ సృష్టి అయినా, కొంతవరకూ అది సాంఘిక సృష్టికూడా కనకనూ, కళ అనేది సంఘంయొక్క ఉపయోగం కోసమే ఉద్దేశించబడినది కనుకనూ పై విధమైన బాహిర విమర్శ లేక సాంఘిక విమర్శకూడా చేయవలసిన అగత్యం ఉన్నది. సినిమా చిత్రాన్నే తీసుకుందాం. సినిమాను అసంఖ్యాక ప్రజలు చూస్తారు. వారి మనస్సులపై అది ప్రత్యక్షంగా కాకపోయినా పరోక్షంగా నైనా అమితమైన ప్రభావం ప్రసరింపచేస్తుంది ప్రజల మనస్సులను అతి సన్నిహితంగా ఆకర్షించ గలగటంలో సినిమాను మించిందిలేదు. అందుచేత సంఘధర్మానికి వ్యతిరేకమైన ధర్మాన్ని చూపించే కథలుగల చిత్రాలను అవశ్యం విమర్శించవలసి ఉంటుంది. కథా శిల్పాన్ని మాత్రమే విమర్శించాలి, కథకు ఆధారమైన సిద్ధాంతాన్ని విమర్శించకూడదు అనేవారు 'కళ కళకోసమే' అనే వాదానికి చెందినవారు. ఈ వాదం అరాజక వాదానికి సన్నిహితమైనది.



పొలంలో పనిచేస్తున్న భర్తకు చిన్నమ్మ అన్నం మోసుకుపోతుండగా సాతాని జియ్యరు వేషంలో విష్ణుమూర్తి ఎదురౌతాడు. ఆకలవుతోంది అన్నం పెట్టమని అడిగి, కుండెడు అన్నమూ తినేస్తాడు.

జెమినీవారి "చిన్నమ్మకథ"లో పాతూరి సుబ్బారావు, కృష్ణకుమారి.

సినిమా విమర్శకు ఆంతర, బాహిర విమర్శలు రెండూ అవసరమైనవే. ప్రస్తుతం సినిమా విమర్శ ఇంకా ఒకదోవన పడలేదు. సారస్వతం, చిత్రలేఖనం మొదలైన కళలకు కొన్ని శతాబ్దాల చరిత్ర ఉన్నది. సినిమాకళ ఇంకా శైశవయస్సులోనే ఉన్నది. అందుచేత సినిమా విమర్శకు కూడా నిర్దిష్టమైన ప్రమాణాలు ఏర్పడలేదు. వార్తాపత్రికలలో ప్రచురితమయ్యే వ్యాఖ్యలను సమీక్షలనే అనాలిగాని సరియైన విమర్శలకింద జమకట్టడానికి వీల్లేదు. ఆధునికయుగంలో జర్నలిజం వచ్చి సాహిత్యాన్ని అణగదొక్కినట్లే పత్రికా [illegible]క్షలు వచ్చి సరియైన విమర్శలకు [illegible] లేకుండా చేశాయి. మామూలుగా పత్రికలలో ప్రకటింపబడే సినిమా సమీక్షలు స్థలాభావం చేతనైతేనేమి, సమీక్షకులకు సినిమా శిల్పాన్ని గూర్చి తగినంత విజ్ఞానం లేకపోవటంచేత నైతేనేమి తృప్తికరంగా ఉండటం లేదు. దానికితోడు విమర్శనా దృష్టిగల సమీక్షకులను చిత్రనిర్మాతలు



మునిమాను కొడుకైన రంగనికి జ్యోతి చొక్కా కుట్టి యిచ్చిందని ఆ చొక్కా తొడుక్కుని,
ఛెంకలు కొట్టుకుని మురిసిపోతున్నాడు రంగడు.

నవయుగవారి "జ్యోతి"లో చామకూర ఉష, జి. వరలక్ష్మి, శివరావు.

## దసరాకు విడుదలకానున్న
# "సంక్రాంతి" కథ

అన్నపూర్ణమ్మ సంసారం పాలసముద్రమువంటిది. కాని దానికి విరుగుడుగా తయారైన పెద్దకోడలు కాంత అంతులేని ధనాశతో భర్తవిశ్వంను కీలుబొమ్మగా చేసి సంసారాన్ని రసాభాసుపాలు చేస్తుంది. దీనికి తోడు విద్యావంతుడైన రెండవకొడుకు బ్రహ్మానందం వైరాగ్యములో పడిఉంటాడు. కాంత విజృంభించి తోటికోడలు లక్ష్మిని నానా హింసలు పెట్టుంది.

ఆ వూరిలోనే చంద్రయ్య అనేల కూలి కారి ఉన్నాడు. చంద్రయ్య కూతురు రాధ అన్నపూర్ణమ్మ మూడవ కొడుకు మోహన్‌ను ప్రేమిస్తుంది. కాని ఇద్దరి కుటుంబాలకు బహుకాలంగా విరోధము. మద్రాసులో బి. ఏ. చదువుతూ ఉన్న మోహన్ సంక్రాంతి సెలవలకి గ్రామానికి వచ్చాడు. రహస్యంగా తరుచు రాధా, మోహన్‌లు కలుసుకుంటూ ఉండేవారు.

కాంత కుటిలత్వంవల్ల మోహన్ చదువుకు స్వస్తి చెప్పిస్తుంది, అఖరికి మామగారి తద్దినానికి కూడ డబ్బు లేదంటుంది. ఈ అన్యాయాన్ని భరించలేక మోహన్ దొంగతనంగా ఇనుప పెట్టెలోనుండి డబ్బు తీస్తాడు. ఈ దొంగతనాన్ని కాంత లక్ష్మికి అంటకట్టుతుంది. లక్ష్మి తలమీద పడిన నేరాన్ని తప్పించటానికిగాను మోహన్ తన దొంగతనం ఒప్పుకుంటాడు. వెంటనే కాంత లక్ష్మి, మోహన్‌లను గురించి అపవాదు వేస్తుంది. ఈ అవమానము భరించలేక లక్ష్మి నూతిలోపడి చనిపోతుంది బ్రహ్మానందం విరక్తితో యిల్లువదలి వెళ్లిపోతాడు.

కాంత ధనాశతో, రహస్యంగా కూడబెట్టిన ధనంతో విశ్వం సకుటుంబముగా మద్రాసుపోయి యఫ్ యస్ రావు అనే వింత వ్యక్తితో వ్యాపారముచేసి సర్వనాశనమౌతాడు. అక్కడ చంద్రయ్య ఖూని అవుతాడు. నేరం మోహన్ మీద పడుతుంది దానికి సాక్ష్యం రాధ.

ఈ ఖూనికేసులో, నిజం బయటపడటం, రాధా, మోహన్‌ల ప్రణయము సక్రమంగా పరిణమించటముతో కథ సమాప్తమౌతుంది.

సంక్రాంతి చిత్రములో కాంతమ్మగారు, శ్రీరంజని, సావిత్రి,-అంజలత,-శివరావు నటించారు.

మాటలు, పాటలు బలిజేపల్లి, డైరెక్టరు శ్రీ. పుల్లయ్య. ★

కూడా కొంచెం దూర దూరంగానే ఉంచటం అలవాటు. అసలు 'మా చిత్రాలపై విమర్శలే అక్కరలేదు' అనే నిర్మాతలు కూడా ఉన్నారు. సరియైన చలనచిత్రకళ వృద్ధికావాలంటే విమర్శ కూడా వృద్ధికావటం అవసరం అందుచేత నిర్మాతలు విమర్శకులను శత్రువులుగా భావించక మిత్రులుగా భావించి ఆరోగ్యకరమైన విమర్శను ప్రోత్సహించవలసి ఉంది. ★

# సినిమా వార్తలు

జెమిని ప్రొడక్షన్సువారు రేవతి స్టూడియోలో తీస్తున్న "చిన్నమ్మకథ" జానపదచిత్రం చాలవరకు అయిపోవచ్చింది. ఈ సెలాఖరులో, దసరానాటికే విడుదల చేయాలని నిర్మాత, దర్శకుడు శ్రీ ఎస్. వి ఎస్. రామారావుగారు ప్రయత్నిస్తున్నారు. ఈ చిత్రంలో శైవుల ఇంట్లో పుట్టి పెరిగి వైష్ణవుల యింట్లో కాలుపెట్టిన చిన్నమ్మగా కృష్ణకుమారి నటిస్తున్నది ఆమె భర్తగా శివరావు నటించాడు. డా॥ గోవిందరాజుల సుబ్బారావు శేషమాంబ, పాతూరి సుబ్బారావు మొదలైనవారు తదితర నటీనటులు. మాటలు, పాటలు శ్రీ బలిజేపల్లి లక్ష్మీకాంతంగారు సంగీతం శ్రీ పేలూరి కృష్ణమూర్తి. డిస్ట్రిబ్యూటర్లు పూర్ణావారు.

*　　*　　*

రాజరాజేశ్వరీవారి "పేదరైతు" సాంఘిక సమస్యాచిత్రం దీపావళికి తప్పకుండా విడుదల అవుతుందని తెలుస్తున్నది. ఈ చిత్రం ఎటువంటి ఆర్భాటమూ, ఆడంబరమూ లేకుండా జెమినీ స్టూడియోలో గప్‌చుప్‌గా నిర్మించబడింది నాయికపాత్ర ధరించిన అంజలీదేవి అనుకోకుండా కొద్దిగా అస్వస్థత చెందిన కారణంగా ఇంకో అయిదారు రోజుల షూటింగ్‌మాత్రమే మిగిలి వుందట. కన్నాంబ, లింగమూర్తి, శ్రీరామమూర్తి మున్నగువారు ఈ చిత్రంలో నటించారు.

*　　*　　*

విజయవంతములైన చిత్రాలుతీసే సంస్థలవారిలో ఒకరైన వినోదావారు తమ మూడవ చిత్రం "దేవదాసు" తిరిగి ఈనెల 5 నుండీ షూటింగ్ ప్రారంభిస్తున్నారు. నాగేశ్వరరావు, సావిత్రి నటిస్తున్న ఈ చిత్రం మూడింట రెండువంతుల వరకూ అయినట్లు తెలుస్తున్నది. వినోదాలో భాగస్వామిఅయిన సుబ్బరామన్‌గారు అకాలంగా కాలధర్మం చెందటంతో నిర్మాణగతి కొంతకాలం ఆగినా ఇకపై చురుగ్గా చివరివరకూ సాగగలదని తెలుస్తున్నది. ఈ చిత్రం తరవాత వినోదావారు "కన్యాశుల్కం" ప్రారంభిస్తారు. "బాలసన్యాసమ్మకథ", మొదలైన ఇంకా మూడు నాలుగు కథలు వినోదావారి దృష్టిలో ఉన్నవి.

*　　*　　*

పృధ్వీ ఫిలిమ్స్‌వారు తీస్తున్న "పరిచయం" స్టార్‌కంబైన్సు స్టూడియోలో షూటింగ్ జరుగుతున్నది ఇప్పటికి మూడు



ఈస్టిండియా వారి "సంక్రాంతి"లో సురభి కమల, శివరావు.

ఎడిటెడ్ రీళ్లు, కొన్ని పాటల రికార్డింగు అయినాయట. రజని, గిరిజ, డా॥ గోవింద రాజుల, వంగర, పాలడుగు సుబ్బారావు, మెహబూబ్, ఇంకా చాలమంది కొత్త వారు ఈ చిత్రంలో నటిస్తున్నారు కథ, మాటలు పి రాఘవరావు, పాటలు కంది కొండ, సంగీతం అశ్వత్థామ

* * *

ఎ వి ఎమ్ వారి "గర్ల్" వచ్చేనెల పూర్తి కావచ్చునట అంజలీదేవి, నాగయ్య, వైజయంతీమాల మున్నగువారు ఈ చిత్రంలో నటిస్తున్నారు అంజలీదేవి నటిస్తున్న జూపిటర్ వారి "ఇన్స్పెక్టరు" సగంవరకూ తయారైందని తెలుస్తున్నది మోడరన్ థియేటర్సువారు నిర్మిస్తున్న "సవతిపోరు" మూప్పాతిక వంతులు పూర్తయిందట ఈ చిత్రం దీపావళినాటికి సిద్ధం కాగలదని వినికిడి.

* * *

వాహినీవారి "పెద్దమనుషులు" రేవతి స్టూడియోలో ఈ నెల పదిహేనునుంచి షూటింగ్ ప్రారంభమౌతుందని తెలుస్తున్నది పీపుల్స్ ఆర్ట్ వారి "పల్లెటూరు" దాదాపు పూర్తయినట్లే మరొక అయిదారు రోజుల షూటింగ్ మాత్రం మిగిలి వుందట ఈ నెల 29 వ తేదీన విడుదల కాగలదని తెలుస్తున్నది

* * *

దసరా విడుదలకు సన్నాహాలు చెయ్యబడుతున్న చిత్రాలు మూడు నాలుగున్నాయి. ఈస్టిండియావారి "సంక్రాంతి" కూడా దసరాకే విడుదల చేయబడుతుందట.

* * *

జెమినీ స్టూడియోలో పనివారి రిట్రెంచ్‌మెంట్ జరుగుతున్నదని కిందటివారం ప్రకటించాము, ఇప్పటివరకూ 300 మంది వరకూ తొలగించబడ్డారట ఈ రిట్రెంచ్‌మెంట్ అల్లజడి ఇతర స్టూడియోలకుకూడా పాకే ప్రమాదం కనిపిస్తోంది

* * *



మద్రాస్, ప్రభాత్ టాకీస్‌లో ప్రదర్శిత మౌతున్న "పర్ ఛాయీ"లో జయశ్రీ, శాంతారాం.



పృధ్వీ ఫిలిమ్స్‌వారి "పరిచయం"లో ఒక దృశ్యం. మధ్యలో కూర్చున్నది రజని.

## నగరంలో సినిమాలు

బాంబేటాకీస్ వారి "మా" హిందీచిత్రం అశోక్, రాజకుమారి టాకీస్‌లలో కొత్తగా విడుదల అయింది లీలాచిట్నీస్, శ్యామ్,

భారత్ భూషణ్, నజీర్ హుస్సేన్ మున్నగు వారు ఇందులో ముఖ్యపాత్రలు ధరించారు.

న్యూ ప్రీమియర్ ఫిలిమ్స్ వారి "నౌ బహార్" స్టార్ టాకీస్‌లో గతవారం విడుదల అయింది. అశోక్‌కుమార్, నళినీ జయవంత్ మున్నగువారు నటించారు. అశోక్‌కుమార్ అంధ యువకుడుగాను, నళినీ జయవంత్ అతన్ని ప్రేమించిన పల్లెటూరిపిల్లగాను నటించారు.

శాంతారాం తీసిన "పర్‌ఛాయీఁ" హిందీచిత్రం ప్రభాత్ టాకీస్‌లో విడుదల అయింది. ఈ చిత్రంలో జయశ్రీ ధనిక యువతిగాను, శాంతారాం అంధ ప్రేమికుడుగాను నటించారు. విశిష్టమైన కథ, ప్రతిభావంతమైన దర్శకత్వం ఈ చిత్రానికి వన్నె తెచ్చినవి. ★

## "సినిమా"

కొత్తసినిమా మాసపత్రిక "సినిమా" ప్రారంభ సంచిక (సెప్టెంబరు, '52) మా కార్యాలయానికి చేరింది. ప్రచురణకర్త బి. నాగిరెడ్డి; సంచాలకుడు చక్రపాణి. వెల 0-8-0. ఈ సంచికలో డైరక్టర్ ప్రసాద్ స్వీయానుభవాల వ్యాసం, ఎన్. టి. రామారావును గూర్చి ఒక స్కెచ్, శ్రీధర్, నాగేశ్వరరావు, ఆది ఎమ్. ఇరాని, రంగారావు, గోఖలేగార్ల తొలి సినిమా అనుభవాలూ, "తారాపథం" అనే సీరియల్ నవల, సినిమా బొమ్మలూ ఉన్నాయి. పత్రిక గెటప్ ఆకర్షకంగా ఉన్నది. ★

రాజకమల్ వారి "పర్‌ఛాయీఁ"లో చిత్రకారుడు వేసిన చిత్రరువు లాగా ఉన్న జయశ్రీ.



# ప్రశ్నలు సమాధానాలు

శ్రీ వాసిరాజు పూర్ణచంద్రరావు—తెనాలి.

ఆంధ్రరాష్ట్రం ఎలా వస్తుంది? ప్రస్తుతం రాష్ట్రంకోసం జరిగే సత్యాగ్రహం గురించి మీ ఉద్దేశమేమిటి?

—దానికి కాలం పరిపక్వంకాగానే వస్తుంది. ప్రస్తుతం జరిగే సత్యాగ్రహంలో పత్తు ఎంతవరకున్నదో ఆంధ్రరాష్ట్రం వచ్చిన తర్వాతనే అంచనా కట్టగలం.

* * *

శ్రీ పెద్దాడ రామచంద్ర—అమలాపురం.

ఆంధ్రరాష్ట్ర స్థాపనకై విద్యార్థులేమి చేయవలెను?

—ఆంధ్రరాష్ట్రం రాగానే దానిని స్థిరంగా ఉండేటట్లు నిర్వహించడానికి తగిన సమర్థులుగా విద్యార్థులు ఇప్పటి నుంచీ క్రమశిక్షణ పొంది తయారు కావాలి.

* * *

డి. నారాయణ—శంకరుపల్లి.

మొట్టమొదట సినిమా కంపెనీలో చేర దలచినవారికి ఎట్టి అర్హతలు వుండవలెను. ఎత్తు ఎంత వుండవలెను?

—ప్రొడ్యూసరు అభిమానాన్ని ఆకర్షించే శక్తివుంటే చాలు. ధరించే పాత్ర అంత ఎత్తుఉండాలి.

* * *

శ్రీ బి. రామచంద్రరావు—కంకిపాడు.

మనుష్యుడు కూడా బుద్ధిగల జంతువు అని మాస్టరుగారు అన్నారు. ఇందులకు నా స్నేహితుడు ఒప్పుకోలేదు. ఇందుకు మీరు ఏమంటారండీ!

—స్నేహితుడుకూడా మనుష్యుడే—తాను బుద్ధిగల జంతువుకానని వాదించగలడా? అలాగయితే ఆయనతో వాదించకూడదు. * * *

శ్రీ నల్లమోతు సత్యనారాయణ, అప్పికట్ల.

కమ్యూనిష్టులకు జాతీయత లేదనినీ, వారు మాస్కో మానసపుత్రులనిన్నీ ఈనాడు కాంగ్రెసువారు నిందిస్తున్నారు. కాని, కాంగ్రెసువారు మాటకు ముందు అమెరికాపేరు చెప్పుతూ ఎల్లప్పుడూ అమెరికానుంచి సహాయం కావాలంటున్నారు. చేయించుకొంటున్నారు. వీరిని న్యూయార్కు దత్తపుత్రులని ఎందుకనగూడదో సెలవిస్తారా?

—రష్యా సహాయం చేస్తానంటే, కాంగ్రెసు మోకాలడ్డుపెట్టదు. గోధుమలు ఇస్తానంటే తీసికొనటానికి సిద్ధం—డబ్బుసహాయంచేసి యింజనీర్లను పంపి ఏవైనా ప్రాజెక్టులపని చేసి పెడ్తామంటే, వంచనలేని షరతులు ఉంటే, వారి సహాయం వద్దనరుమన కాంగ్రెసువారు. వారు సహాయం చేస్తామని, అమెరికాలాగున అనడంలేదు. మనం యాచించడం లేదు. అంతే తేడా.

* * *

ఎల్. పి. ఆర్. నరసింహాచార్యులు,
పి. ఎస్. శాస్త్రి—బందరు.

*"Fall of Berlin"* తీసినది—యుద్ధాలవల్ల కలిగే నష్టాలు చూపేందుకు; తాము తయారుచేయుచున్న బాంబులతో పిక్చరు చూచేవాని దేశాన్ని బెర్లిన్ మాదిరే ధ్వంసం చేయగలమని చూపేందుకు; యుద్ధాలను చిత్రించటంలో తమకు గల ప్రజ్ఞ...వీటిలో ఏది రష్యావారి భావం?

—రెండవ ప్రపంచయుద్ధంలో రష్యన్ సైనికులు ఎంత దేశభక్తితో పోరాడిందీ చూపించి, తమ ప్రజలను ఉత్తేజపరచటమే ఆ చిత్రం లక్ష్యం.

పల్లెటూరివారికి దయ్యాలపై నమ్మకం వుండి, బస్తీలవారికి లేక పోవటమేమి?

—బస్తీల్లో జనసమ్మర్దం ఎక్కువ. నలుగురిమధ్య కూర్చున్నవాడికి ధైర్యంగా ఉండదూ? * * *

శ్రీమతి ఆర్. రేచక్ స్వర్ణశరత్
కుమారి—బెజవాడ.

మానవునకు పట్టణవాసము సుఖకరమైనదా పల్లెవాసము సుఖకరమైనదా?

—పల్లెకు పల్లెయే-ఢిల్లికి ఢిల్లియే-పల్లెవాసంలోనివాడు కష్టించి సుఖపడ్తాడు-పట్టణవాసంలోనివాడు సుఖించి కష్టపడతాడు...కాని యీ కాలంలో పల్లెప్రజలకు కూడా కాయకష్టంతగ్గి సుకుమారత్వం దుర్బలత్వం ఎక్కువవుతోంది. ఏ వాసమైనా బలంలేని బోలువాసంగానే ఉంది.

★

# హైదరాబాద్ ముల్కీ ఆందోళన

(4-వ పేజీ తరువాయి)

కాపాడ్డం. వీరుగాక కొందరు కాంగ్రెస్ వాదులు కూడా ఈ ఉద్యమాన్ని బలపరుస్తున్నారట. వీరుగాక పీపుల్స్ డెమోక్రటిక్ ఫ్రంట్ వారు కూడా ఈ ఆందోళనకు దోహదమిస్తున్నారు.

ఇతర 'బి' తరగతి రాష్ట్రాలలోకంటె హైదరాబాద్ రాష్ట్రంలోనే పొరుగుప్రాంతాలవారు అధికంగా ఉద్యోగాలు సంపాదించారని ఒప్పుకోక తప్పదు. అలా సంపాదించుకో కూడదనడం రాజ్యాంగనియమాలకు విరుద్ధమే అయినప్పటికీ దీనివల్ల హైదరాబాద్ వారికి అసంతృప్తి కలగడం విరోధభావం ఏర్పడ్డం సహజమేనని ఒప్పుకోక తప్పదు. ఈ విషయమై జాగ్రత్తపడవలసిన అవసరాన్ని హైదరాబాద్ ప్రభుత్వమూ కేంద్ర ప్రభుత్వమూ ముందే గుర్తించి ఉండవలసింది. నిరుద్యోగులు హైదరాబాద్ వాసులయినా ఇతర ప్రాంత వాసులయినా దేశానికి సమస్య ఒకటే. ముఖ్యమంత్రి రామకృష్ణరావు గారు చెప్పినట్లు ముఖ్యంగా ఇది ఆర్థిక సమస్య. కాని ఈ ఆర్థికసమస్య తీరనంత వరకూ ఇట్టి ప్రాంతీయాభిమానాలు వాటంతట అవి సమసిపోవు.

ప్రాజెక్టుల విషయంలో ఆంధ్రుల ప్రాంతీయాభిమానాన్ని ఎంత నిరసించినా ప్రయోజనం ఉండదు. మద్రాసు ప్రభుత్వ నాయకులు నందికొండ ప్రాజెక్టు విషయంలో అవలంబించిన వైఖరి ప్రాంతీయ దురభిమానం కంటె హానికరమైనదని గుర్తించనంత వరకూ, ప్రభుత్వాన్ని నడిపేవారిట్టి పక్షపాత వైఖరి నవలంబించకుండా నివారించ గలిగే వరకూ ఆంధ్రుల ప్రాంతీయాభిమానం సమసిపోదు. ఇదే రీతిగా ముల్కీ, నాన్ ముల్కీ విచక్షణ ఎటువంటిదైనప్పటికీ ప్రాంతీయావసరాల్ని కూడా గమనించనంత వరకూ ఇటువంటి ఆందోళనలు తప్పవు. ప్రభుత్వాలు సర్వజనుల శ్రేయస్సుకోసం పరిపాలించడం చాలదనీ, ఈవిషయమై ప్రజల్ని సంతృప్తిపరచడం కూడా అవసరమనీ ఒకరన్న మాటలు మరచిపోరానివి.

[5-9-1952]

---

## బస్తీ మోజు

(29-వ పేజీ తరువాయి)

కేం తక్కువైందిరా? నిక్షేపంలాంటి పిల్లను చేసుకోనంటావు.

రా: మీ రెన్ని చెప్పినా సరే. ఇంతే. నేను బస్తీపిల్లను చేసుకుంటాను. చదువురాని శుద్ధమొద్దు, నాగరకత అంటే యేమిటో తెలియని పశువు, అట్లాంటి దాన్ని నాబోటివాడికి అంటగట్టాలని మీరు ఎట్లా అనుకున్నారో ఆశ్చర్యంగా ఉన్నది.

వెం: అయిన సంబంధం వదులుకున్నామా, ఇక అది మళ్ళీ కలవటం దుర్లభం. కాళ్ళదగ్గర కొచ్చిన బేరం కాలికిపోయినా రాదంటారు. ఏదో పెద్దవాడిని; నా మాట విను; ఎందుకు చెబుతున్నానో తెలుసుకో. మేము మాత్రం మీరు చెడిపోవాలని చెబుతామా?

రా: ఇంక ఆ పాతపద్ధతులు పనికిరావు. ఏ పిల్ల నచ్చితే ఆ పిల్లనే చేసుకోవాలిగాని, సంబంధము కలవదని, లేకపోతే మీకు ఇష్టమైనదనీ, పూర్వ సాంప్రదాయమనీ, వాళ్ళన్నారనీ వీళ్ళన్నారనీ, పిచ్చినమ్మకాలు మానండి. ఇంతకన్నా మంచి సంబంధమే దొరుకుతుంది; లోకం గొడ్డుపోయిందా యేం?

వెం: ఇంతకూ నామాట విననంటావు అంతేగా?

రా: అదిగాదు నాన్నా-! కాలం మారింది నీకుమాత్రం తెలియదా? పల్లెటూరి సంబంధం చేసుకుని నన్నెట్లా అవస్థపడమంటారు? సంసారం ఓ బండిలాంటిది. దాని రెండు చక్రాలూ ఒకే మాదిరిగా వుండాలిగాని, విధవిధాలుగా వుండకూడదు. మీరయినా, నా బాగుకోసమే చెబుతున్నానంటున్నారుగాబట్టి - నామాటవిని బసవయ్య మామ మాట మళ్ళా ఎత్తకండి. అన్ని విధాలా అనువయిన సంబంధం మరొకటి తర్వాత చూసుకోవచ్చును.

వెం: చెప్పవలసినవాడిని, పెద్దవాడిని గనక చెప్పాను. ఇక నీ యిష్టం. తరువాత నీవే తెలుసుకుంటావు. ఆనాడు విచారపడితే లాభం లేదు. నామాట విను... వినవా...నీఖర్మ...అనుభవిస్తావు...

రా: ఖర్మాలేదు గిర్మాలేదు.

వెం: ఇంకెక్కడైనా సంబంధం విచారించుకోమని వాళ్ళకు కబురు చెయ్యమంటావా?

రా: ముంచుకుపోయిం దేమీలేదు.

వెం: అదేంమాట? మనం చేసుకుంటే చేసుకుంటామని చెప్పాలి. లేకపోతే లేదని చెప్పాలి. కేవలం మనమీదే ఆశలుపెట్టుకుని వున్నాడు యింతవరకూ - ఏమంటావు?

రా: అయితే చెప్పెయ్యండి - యేమనేదేముంది?

వెం: సరి! ఇక నే చేయగలిగిందేముంది? ఎవరిఖర్మకు ఎవరు కర్తలు గనుక? - పొద్దెక్కింది - పోతాను.

రా: బొత్తిగా పల్లెటూరిదాన్ని చేసుకుంటే అన్నీ అనర్థాలేనాయె! రోజూ యింత కాఫీ నీళ్ళు కాచి యివ్వటమయినా చేతవాలా? బస్తీ వ్యవహారాలే తెలియకుండా అఘోరిస్తే - రేపెక్కడో, యే విశాఖపట్నంలోనో ఉద్యోగమయితే - నా బతుకు నవ్వులపాలైపోతుంది. ముందు జాగ్రత్తే మంచిది! బసవయ్య మామకు అల్లుళ్ళవటానికి తగ్గవాళ్లెంతోమంది వున్నారు.

* * *

రంగయ్య: పిల్లను ఆ పల్లెటూరు యెట్లా పంపేదండీ? ఎన్నడూ ఇల్లు విడిచి వెళ్లనిది. పైగా యేమీ తెలియనిది. దాన్ని పంపటం నాకిష్టం లేదండీ...

వెంకయ్య: అదేమిటి రంగయ్య బావగారూ! అన్నీ ఎరిగినవారు మీరే ఇట్లా అంటారేం? పిల్ల యెప్పుడూ ఇక్కడే యెట్లా వుంటుంది?

రం: ఆ పల్లెటూరు పంపనండీ—

వెం: పల్లెటూరు పల్లెటూరు అని మాటిమాటికీ అంటారు. మరి ముందే తెలిసి ఉండి ఆ పల్లెటూరి సంబంధం యెందుకు ఇచ్చారు?

రం: పిల్లవాడు చదువుకున్నవాడు గదా అని—అంతేగాని పల్లెటూరి కాపురం చేయిద్దామనిగాదు. ఎక్కడైనా ఉద్యోగం దొరకదూ? చదువుకోని ఇంటిదగ్గర ఊరికే కూర్చోమంటారా?

వెం: చదువుకుంటే ఉద్యోగమే చేయాలా? ఏదో వున్నదిగా. వ్యవసాయం చూసుకుంటూ ఇంటిదగ్గర నా కళ్లముందు ఇద్దరూ ఉంటారు. అందులో పెద్దవాడు ఒక్కడే ఇంటిదగ్గర ప్రతిపనీ చూసుకోవలసివస్తుందే. ఇద్దరూ ఒకచోట

ఉంటే వ్యవసాయం తేలిగ్గా జరుగుతుందని...

రం: ఇంత చదువూ చెప్పించి ఇంట్లో కూర్చోపెడతా నంటారేమిటి వెంకయ్య బావగారూ?

వెం: పొలం పని వాడి ఒక్కడిచేత కావడంలేదు. నేను పెద్దవాణ్ణయ్యాను. ఇక అంతా వాళ్ళమీదే వదిలేసి ఇంటి దగ్గర కృష్ణారామా అంటూ కూర్చుంటాను-

రం: ఆ పల్లెటూరిలో యేమితోస్తుంది. ఏదో బస్తీలో వుండాలిగాని. అయినా అతగాడేమంటాడో కనుక్కోండి.

వెం: ఏమంటాడు, రానంటాడా! ఇల్లూ వాకిలీ వదిలి బస్తీలు తిరుగుతానంటాడా?

[రామారావు ప్రవేశం]

రం: ఏమోయ్ రామారావు! మరి మీ నాన్నగారు ఇంటికి తీసుకుపోతా మంటున్నారు. నీవేమంటావు?

రా: ఎందుకు ఇంటికి? ఆ పాడుపడ్డ కొంపల్లో ఎవడుంటాడు. క్లార్కు ఉద్యోగానికి అప్లికేషన్ పెట్టాను. అది శాంక్షనై వస్తుంది. ఇక్కడే వుంటాను.

వెం: ఆ నీ దుంపదెగ! పాడుపడ్డ కొంపలా? ఇన్నాళ్ళూ ఎక్కడా పెరిగింది? హాయిగా కాలుమీద కాలువేసుకుని కాలక్షేపం చేసే అవకాశంవుండగా, యీ మురికిగొందుల్లో - ఊపిరాడని యీ 'సువిశాల' భవనాల్లో - యిరుక్కుపోయి వుంటానంటావు-పైగా వెధవ వుద్యోగాలారా! నియమం తెరిపా యేమన్నానా? శ్రమేగాని అంతకన్నా మరేముంది? నీకేమైనా పిచ్చా; వెర్రా? ఆ మాత్రం వివేచన జ్ఞానమూ లోపించిందా యేమిటి? చదవేస్తే వున్న మతి పోయిందన్నట్లే నెనకటికి, నీలాంటివాళ్ళను చూసి! ఇంటిదగ్గిర మీ అన్నయ్య ఒక్కడే అన్ని పనులూ చూసుకోలేక అవస్థపడుతున్నాడు, నీకు తెలియదు గాని!

రా: అంత చేతకాకపోతే పొలాలు కౌలుకు ఇవ్వండి; అవస్థపడటం దేనికి? పైగా ఎవర్నో వుద్ధరిస్తోన్నట్లు.

వెం: ఉద్ధరింపా??—ఓరి! నీకు ఈ బస్తీ పిచ్చెక్కడ పట్టుకుందిరా?

రా: మరి చదువు ఎందుకు చెప్పించారు? నన్నూ గొడ్లను కాయించక పోయారా? అన్నయ్యలాగా కొంపలో పడి ఉండేవాడిని.

వెం: అదే నేను చేసిన బుద్ధితక్కువ.

రా: ఇప్పుడనుకొంటే ప్రయోజనమేముంది. మొదటనే ఉండవలసింది.

వెం: నీవు యేదో చదువుకొని ఉద్ధరిస్తావనుకున్నాను గానీ, ఎప్పుడూ బస్తీల్లో ఏడుస్తావని తెలిసివుంటే ఈ దిక్కుమాలిన చదువు చెప్పించేవాడిని గాను.

రా: ఇంకేమి? ఇక వూరుకోండి! అయినా B.A. దాకా చదివించి కొంపలో పడివుండమంటే నా తరం గాదు. ఏదో ఉద్యోగం చెయ్యాలిగాని—

రం: అవును అంతే మరి—ఇంత డబ్బు ఖర్చుపెట్టి చదివించటం దేనికి?

వెం: సరిపోయింది, మామా అల్లుళ్ళ జంట. చిన్నవాడికి తెలియకపోతే చెప్పడంపోయి, వాడికంటే ముందు యీయనే వద్దంటుండె. ఇక అనుకునేదేముంది?

రా: సరేగానీండి, ఇక నాకు టైము అవుతున్నది. లీహాశ్నలుదారుగారు కచేరీకి సరిగా పదకొండు గంటలకే రమ్మన్నారు. నేను వెళ్లొస్తా నాన్నా!

వెం: ఇంతకూ ఇక్కడనించి కదల నంటావు? అయినా నీకిదేమి దుర్బుద్ధిరా?

రా: మళ్ళీ మొదలెడుతున్నారెందుకు? నేను త్వరగా వెళ్ళాలి. ఉద్యోగం చేస్తుంటే చూసి సంతోషించాలిగాని ఇంట్లో పడివుండమంటా రేమిటి?

వెం: లేకనా ఉద్యోగం; ఎందుకురా? ఇంట్లో ఉన్నదే తిని ఇంటిపట్టున పడి ఉండక.

రా: నేను వెళుతున్నాను, లేటవుతున్నది మరి.

వెం: బుద్ధిగద్దితిని చెప్పించాను వెధవ చదువు. ఈ చదువు లేకపోతే కొంపలో నన్నా పడివుండేవాడేమో. బస్తీసంబంధ మాయెను. ఇక నా మాట చెవికెక్కుతుందీ. పెత్తనానికి నా కొచ్చింది తిప్పలు. వెళ్లి వస్తా బావగారూ! జాగ్రత్తగా చూస్తూ వుండండి.

* * *

సీత: కాఫీపొడి అయిపోయిందండీ!

రామారావు: ... ... ... ...

సీత: మిమ్మల్నే! కాఫీపొడి అయిపోయింది.

రా: మొన్ననేగా అరవౌను తెచ్చాను?

సీత: అరవౌను ఎన్నాళ్లు వస్తుందీ!

రా: అయితే రెండు రోజులకు అరవౌను కాఫీపొడి అయితే, నెలకు పదిహేను వౌనులా? ఇట్లాగైతే సంసారం బాగు పడ్డట్టే.

సీత: ఎందుకు నామీద విసుక్కుంటారు? నే నేమన్నా కాఫీపొడి మింగుతున్నానా? మీతోపాటు నేనూ గుక్కెడు కాఫీనీళ్లు తాగుతున్నాను. దీనికే నేనేదో అంతా మింగుతున్నట్లు...

రా: నువ్వు మింగుతున్నావని ఎవరన్నారు? కొంచెం నాకు వచ్చే జీతం కనిపెట్టి, సర్ది, వాడమన్నాను. దీనికే ఇదంతా వెందుకూ?

సీత: ఎంత సర్దినా మరి రెండురోజులకే అయిపోతుండె. కొంచెం మీ స్నేహితుల కివ్వటం సర్దుకోరాదూ?

రా: వేళకొచ్చినవాడికి మనతో బాటు కాస్త కాఫీనీళ్లు ఇవ్వకుండా ఎట్లా పంపటం? ఏదో సర్ది ఇకనుంచైనా వాడు.

సీత: పనిమనిషి రాలేదు. ఇంకో కర్తెను మాట్లాడండి, దీనితో వేగలేక పోతున్నాను. చెప్పిన పని పనేమిరా చేయనే చేయదు.

రా: కాస్త ఇల్లువూడ్చి నీళ్లు చల్లుకొనే దానికి మనిషెందుకూ...? మాన్పిస్తే రెండు రూపాయిలు మిగులుతాయిగా...

సీత: నేను మాత్రం ఊడవలేను. వెధవ కొంప, వంటచేసేటప్పటికే నా పనైపోతోంది.

రా: సరేకానీ...

సీత: మరి స్నోకీసా, పౌడరుడబ్బీ తెచ్చి పెట్టారూ? అయిపోయి వారంరోజులైంది. అడిగితే విసుక్కుంటారని ఇంత మటుకూ చెప్పలేదు.

రా: స్నోలు! పౌడర్లు!! ఎందుకూ? అసలే వచ్చే డెబ్భైనాలుగు రూపాయిలు



"బ్రదర్. నీకు పది రూపాయలు బాకీ ఉన్నా గదూ?"

"అవును, నాలుగు నెల్ల కింద తీసుకుని మళ్ళీ మొహమేనా చూపెంచావు కాదు."

"అందుకే వచ్చాను బ్రదర్. ఒక్క పదిరూపాయిలుంటే ఇవ్వవోయ్, అదీ ఇదీ కలిపి ఏకంగా ఇచ్చేస్తాను."

చాలక … కొన్ని ఖర్చులు తగ్గించాలి

సీత. ఉంటే ఉండె నే నేమన్నా అడిగితే మారి కసురుకుంటారు

రా. కసురుకోవటం గాదు ఎన్ని చెప్పినా కొనిచ్చివి చెప్పై నాలుగు రూపాయలు గదా! ఇంటి అద్దె యిరవై రూపాయిలూ, పాలమనిషికి పది రూపాయిలూ, పనిమనిషికి ఏడు, ఇంకా చాకలివాడికీ, మంగలివాడికీ, నాటుకి వీటికీ పోగా, సంసారం ఐదు రూపాయలు ఎట్లాగడిచిపోతుంది?

సీత అంత ఎక్కువ చాలకపోతే వీరనాన్నను పంపమనగాదా దమిటి?

రా. సీతా! అలోచించే మాట్లాడుతున్నావా? వేలకు వేలుపోసి యీ చదువు చెప్పించినది చాలక వాళ్ళను యింకా నెలనెలా డబ్బు పంపమని పీడించనా? వాళ్ళను పోషించకపోయినా, కనీసం నామటుకు నేను సంపాదించుకోవాలి గాని. వాళ్ళింత చదువు చెప్పించింది, నేనేదో వుద్యోగం చేసి, తమను వుద్ధరిస్తానని గాదూ? వాళ్ళ ఆశలన్నీ అడియాసలు చేసి - డబ్బు డబ్బని చదువుకునే గోజుల్లోలాగా తెలిగ్రాములు మూకించటం బాగుంటుందా? అక్కడెయినా తిన్నేవాళ్ళు లేరూ? మన కింకా ఎట్లా వేరుగాని, మా అన్నయ కప్పుడే యిద్దరబ్బాయిలూ? చేతినిండా ఖర్చు. అయినా యేమనడగను? నలుగురూ నవ్వుతారు...

సీత : ఎందుకు నవ్వుతారేమిటి? ఏమన్నా పరాయి సొమ్ము తెమ్మంటున్నారా? మీ సొమ్ము మీరు తినటానికేమి?

రా. నేను ఇంటినుంచి నయాపైసా దమ్మిడీ తెప్పించను. ఏవిధంగానైనా ఈ వచ్చేదానితోనే సరిదిద్దుకోవాలి.

సీత. అవ్వా కావాలంటే బువ్వా కావాలంటే ఎట్లా వస్తుందీ? మనం మాత్రం నలుగురిలో హీనంగా ఎట్లావుంటాము. మాట మాటకూ సర్దుకోవలంటారు సర్దుకోవాలని.

రా. అనవసరమైన ఖర్చులు సర్దుకోవాలంటున్నాను. దినం విడిచి దినం సినిమాలకు, అనవసరమైన, స్నోలకు, చిరుతిండ్లకు ఖర్చుపెట్టవద్దని చెప్పేది.

సీత ఇదేమన్నా పల్లెటూరండీ? నోరు బిగించి, కళ్లు మూసుకో కూర్చోవటానికి ఎంత వద్దనుకున్నా రోజుకు హీనపక్షం రూపాయన్నా లేకపోతే బస్తీ కాపురం యెట్లా చేయటం

రా : కానీ తిండిపెట్టు టైము అయిపోతున్నది. తొందరగా ఆఫీసుకు చేరాలి అబ్బబ్బ, యీ బస్తీ కాపురంతో చచ్చిపోతున్నాను ఎంత ఉబ్బైనా హరించుకుపోతున్నది.

* * * *

సీత పండుగలోగాలు చంద్రహారం పంపండి మామయ్యా! మరీ బోసి మెడ బాగుండలేదని అంతా అంటున్నారు

వెంకయ్య! చంద్రహార మేమిటమ్మా?

సీత : అదేనండి, మా పెళ్లిలో పెట్టింది. మొన్న మీకు పంపారే, అది

వెం అవును పెళ్ళిలో పెట్టిన చంద్రహారం! మొన్న నాకు పంపారా? ఎవరూ? యిమిటి అర్థంగాకుండా వుంద

సీత అదేమిటి మామయ్య అట్లా అంటారు ఇక్కడ వుంటే మంచిది గాదనీ అద్దెకొంప అనీ—పాపిష్టిరోజులు ఎవరినీ నమ్మటానికి వీల్లేదనీ—మీ అబ్బాయి నా చంద్రహారం భద్రతకోసం మీకు పంపారు కాదూ? మర్చిపోయారా?

వెం మర్చిపోవట మేమిటి? అసలు చంద్రహారం సంగతే నాకు చెప్పందే?

సీత : పంపామన్నారు మామయ్యా!

వెం. తమాషాగావుందే! ఏంరా! రామారావు!-అరేయ్. !

రా. (దూరంగా) ఏమిటండీ ..

వెం : ఏమిటి చంద్రహారం అంటుంది అమ్మాయి ఏంచేశావు? నాకు పంపావా?

రా. లేదు . పం .

సీత : పంపామన్నారే? మరేంచేశారు?

వెం : ఏంరా మాట్లాడవే? ఏమయినా అన్యాయమెల్లాం జరగలేదుగదా.

రా : లేదు లెండి అమ్మేశాను ..

సీత : ఆఁ! ఎందుకు అమ్మారు! ఎందుకండీ??

రా : ఎందుకా, వచ్చేడబ్బు చాలక. మరి ఎట్లా నడుస్తున్నదనుకున్నావు బస్తీకాపురం.

వెం : ఒరే వెధవా! నీ ఏడుపు ఇదా! పైసా ఇంట్లోవన్నీ అమ్మి నీ బస్తీకాపురం ఏమిటిరా? సంపాదించటంలా; ఏదో నౌకరీ యేడుస్తున్నావుగా?

రా. నాకు వచ్చే కొద్దిజీతం చాలక....

వెం. అంత చాలకపోతే పంపమని అఘోరించకపోయావు పైకం ప… వాణ్ణిగా...

సీత నేనూ అదే చెప్పావండి – వేలకు వేలూ ఖర్చు చేయించారుట! వుద్ధరిస్తారని మీరనుకున్నారట! అందుకని పంపమని రాయనంటే రాయనని కూచున్నారు.

వెం. ఒరే నీ—ఎల్లాగూ వుద్ధరిస్తావని మేం అనుకోలేదులే! పంపమంటే కొంత గాకపోతే కొంతయినా పంపేవాళ్ళంగా – ఇక్కడిలాగా మేమేం అక్కడ పస్తులుండక్కర్లేదాయె ఇదేం దుర్బుద్ధిరా! ఆడదాని సొమ్ము అమ్ముకూర్చున్నావా? ఎంత కాని పని! అవ్వ! చెప్పుకుంటే సిగ్గు

రా అనండి ఇంకా అనండి! నేను చేసుకున్నది యింతానూ! మీరు ఎంత చెప్పినా వినక—ఉద్యోగమని కార్యాలకుపోయి కొంపమీదికి తెచ్చుకున్నాను. చేసుకున్నదానికి అనుభవిస్తున్నాను గాని మరేం ఎక్కువ గాదు.

సీత. మిగిలిందిది ఏముంది? కాదూ కూడదంటే, నామీద విరుచుకపడతారు! నేనేదో అనవసరపు ఖర్చులు చేస్తున్నట్లు కాకపోతే. నేను చేసేవాటిలో యేది అనవసరమైనదో కొంచెం చెప్పండి చూద్దాం!

రా ఏదా? ప్రతిదినీ. స్నోలూ, పౌడర్లూ—రిబ్బన్లు ..

సీత. అమ్మయ్య – అవ్వి దొరికేవి సాధింపులకు. అవి మీకు అనవసరమయితే అయినాయేమో గాని నాకు అత్యవసరం సుమండీ! అవ్వి లేకుండా దబెముఖం వేసుకొని నేనుండలేను – మీ కెంత కోపం వచ్చినా సరేగాని!

వెం. సరే! ఏడ్చినట్లే వున్నది గాని మీ బస్తీకాపురం; కొంపకు చేరండి. సుఖంగా పడిఉందురుగాని, నేను ఒద్దురా మనకు బస్తీమోజులూ, బస్తీకాపురాలూ అంటే విన్నావా! ఇప్పుడు అఘోరిస్తే ప్రయోజనమేముంది ఏదైనా తడిస్తే గాని గుడిశ కప్పరని పెద్దలు ఊరికే అన్నారా!

Edited, Printed & Published byS Sambhu Prasad at the Andhra Patrika Press, 7, Thambu Chetty St Madras



పంచతంత్రం

# మిత్రభేదం

కర్త... విశ్వాత్ముల నరసింహమూర్తి






























మొదటి మీనం మాత్ర మొంటిగ మరొక కొలనికి వెళ్లిపోయింది












